## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000001794

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శాంతిసేన

ాంధీ



వినోబా

ి.మ.రా

సర్వసేవాసంఘప్రచురణ

# శాంతిసేన

*

మహాత్మాగాంధీ
ప్రబోధ

అనువాదం :
[illegible]

*

సర్వోదయ సాహిత్య ప్రచార సమితి
గాంధీభవన్ హైదరాబాదు.

# ప్రస్తావన

మానవుడు దేవతా కాదు, రాక్షసీ కాదు, దేవతా-రాక్షసీ రెండూ కలసినవాడు మానవుడు. సంస్కృతి, వికృతి అనేవి రెండూ అతని ప్రకృతి యొక్క రెండు పురాతన ప్రవాహాములు. అతను కేవలం ప్రేమమూర్తి మాత్రమే కాదు, అతనిలో క్రూరత్వం కూడ ఇమిడి వుంది. అయితే మనిషికీ పశువుకూ ఉన్న తేడా ఏమంటే, మనిషికి వివేకము ఉంది-దానివల్ల నిరంతరం ఉన్నత పథాన ప్రయాణించాలని కోరుకుంటాడు. అందుచేతనే మానవ హృదయంలో నిహితమైయున్న వికృతిని అణిచి, సంస్కృతిని వికసింపజేయుట అనాదిగా సాగి వస్తున్న మానవ ప్రవృత్తి. తన హృదయంలోని సంస్కృతి వికృతిని అణచలేక పోయినప్పుడు, దైవాన్ని ఆరాధించి ఒక రాజును తెచ్చుకున్నాడు. సంస్కృతి పెంపొందుటకు అవకాశం కలిగించుటకు గాను ఆరాజు తన దండ శక్తిని వినియోగించి నిరంతరం వికృతిని అణుస్తూ వచ్చాడు. ఈ విధంగా రాజశక్తి ద్వారా అంటే దండన శక్తిద్వారా సమాజంలో ఏర్పరచబడిన శాంతివల్ల మొదట్లో మానవునకు నిశ్చితంగా తన సంస్కృతిని వికసింప జేసుకొనుటకు అవకాశం లభించింది.

అయితే, మానవుడు రాజునకు ఎంతగా దైవశక్తిని ఆరోపించినప్పటికీ, 'దైవాంశ సంభూతుని' గా పేర్కొని దండించే వ్యక్తిని ఎంత ఉన్నతాసనంపై కూర్చో బెట్టాలని ప్రయత్నించినా, అతనూ మనిషేగదా. దండించే అవకాశమూ, దానిద్వారా మానవసమాజాన్ని అదుపులో పెట్టేందుకు అధికారమూ లభించుట చేత అతనిలోని వికృతి అభివృద్ధి చెందుటకు ఎక్కువగా ఆధారం లభించింది. దాని

ఫలితంగా పరిజాససమూహానికి సుఖాన్నీ, శాంతినీ చేకూర్చడ మను సాకుతో రాజ్యశక్తి అత్యధికంగా శక్తివంతురాలవుతూ వచ్చింది.

జీవించుటకు పడే ఆరాటంలో భవిష్యత్తు గురించి ఇప్పుడే నిశ్చయించు కోవలసిన అవసరం కలుగు తోంది. దాని వల్ల తాను నిశ్చితంగా ఉండాలంటే ధనాన్ని ఎక్కువగా కూడబెట్టడం అవసరమౌతోంది. ఈవిధంగా మానవునిలో కూడబెట్టే ప్రవృత్తి అంతకంతకు ఎక్కువౌతూ వచ్చింది.

అత్యధికంగా ధనాన్ని కూడబెట్టడం. అధికారాన్ని గుప్పిట్లో పెట్టుకోవడం కారణంగా మానవులలో పోటీ ప్రవృత్తి పరాకాష్ట నందుకుంది. దానితోపాటు హింసా ప్రవృత్తి కూడా ఎక్కువైంది. అభివృద్ధిచెందిన విజ్ఞానం ఈ హింసా ప్రవృత్తితో కలవడంచేత, మొత్తం మానవ సమాజాన్ని నాశనం చేస్తానని హింసా ప్రవృత్తి సవాలు చేస్తోంది.

ఒక్క ప్రక్క ఇది ఇలా ఉండగా, మరొక ప్రక్క మానవునిలో అభివృద్ధి చెందాలని సహజంగా ఉన్న ప్రేరణవల్ల, తనలోని సంస్కృతిని పెంచుకుంటూ, దానిని శక్తివంతం చేసుకుంటున్నాడు. ఇలా మానవునిలోని సంస్కృతి వికసిస్తోన్నకొద్దీ, తనలోని సంస్కృతియొక్క అసమర్థత కారణంగా ఏర్పడిన దండన శక్తి అవసరం అతనిని బాధించ సాగింది. వికృతిని అణిచి పెట్టుటకు రాజదండన అవసరం కావడం మానవ జాతియొక్క సామూహిక సంస్కృతిని అవమానించడమేనని అతనికి తెలియగానే, రాజరికం నుండి ప్రజాస్వామ్యానికి మారవలెనను ప్రేరణ మానవునికి కలిగింది. దానివల్ల విశ్వమంతటా, దండనశక్తియగు హింసాశక్తి బదులుగా వేరొక సాంస్కృతిక శక్తి కొరకు అన్వేషణ ప్రారంభమైంది. "మానవుడు సంపూ

# ప్రస్తావన

మానవుడు దేవతా కాడు, రాక్షసీ కాడు, దేవతా–రాక్షసీ రెండూ కలసినవాడు మానవుడు. సంస్కృతి, వికృతి అనేవి రెండూ అతని ప్రకృతి యొక్క రెండు పురాతన ప్రవాహములు. అతను కేవలం ప్రేమమూర్తి మాత్రమే కాదు, అతనిలో క్రూరత్వం కూడ ఇమిడి వుంది. అయితే మనిషికీ పశువుకూ ఉన్న తేడా ఏమంటే, మనిషికి వివేకము ఉంది–దానివల్ల నిరంతరం ఉన్నత పథాన ప్రయాణించాలని కోరుకుంటాడు. అందుచేతనే మానవ హృదయంలో నిహితమైయున్న వికృతిని అణచి, సంస్కృతిని వికసింపజేయుట అనాదిగా సాగి వస్తున్న మానవ ప్రవృత్తి. తన హృదయంలోని సంస్కృతి వికృతిని అణచలేక పోయినప్పుడు, దైవాన్ని ఆరాధించి ఒక రాజును తెచ్చుకున్నాడు. సంస్కృతి పెంపొందుటకు అవకాశం కలిగించుటకు గాను ఆరాజు తన దండ శక్తిని వినియోగించి నిరంతరం వికృతిని అణుస్తూ వచ్చాడు. ఈ విధంగా రాజశక్తి ద్వారా అంటే దండన శక్తిద్వారా సమాజంలో ఏర్పరచబడిన శాంతివల్ల మొదట్లో మానవునకు నిశ్చితంగా తన సంస్కృతిని వికసింప జేసుకొనుటకు అవకాశం లభించింది.

అయితే, మానవుడు రాజునకు ఎంతగా దైవశక్తిని ఆరోపించినప్పటికీ, 'దైవాంశ సంభూతుని' గా పేర్కొని దండించే వ్యక్తిని ఎంత ఉన్నతాసనంపై కూర్చో బెట్టాలని ప్రయత్నించినా, అతనూ మనిషేగదా. దండించే అవకాశమూ, దానిద్వారా మానవసమాజాన్ని అదుపులో పెట్టేందుకు అధికారమూ లభించుట చేత ఆతనిలోని వికృతి అభివృద్ధి చెందుటకు ఎక్కువగా ఆధారం లభించింది. దాని

ఫలితంగా ప్రజాసమూహానికీ సుఖాన్నీ, శాంతినీ చేకూర్చడ మను సాకుతో రాజ్యశక్తి అత్యధికంగా శక్తివంతురాలవుతూ వచ్చింది.

జీవించుటకు పడే ఆరాటంలో భవిష్యత్తు గురించి ఇప్పుడే నిశ్చయించుకోవలసిన అవసరం కలుగుతోంది. దాని వల్ల తాను నిశ్చితంగా ఉండాలంటే ధనాన్ని ఎక్కువగా కూడబెట్టడం అవసరమౌతోంది. ఈవిధంగా మానవునిలో కూడబెట్టే ప్రవృత్తి అంతకంతకు ఎక్కువౌతూ వచ్చింది.

అత్యధికంగా ధనాన్ని కూడబెట్టడం. అధికారాన్ని గుప్పిట్లో పెట్టుకోవడం కారణంగా మానవులలో పోటీ ప్రవృత్తి పరాకాష్ట నందుకుంది. దానితోపాటు హింసా ప్రవృత్తి కూడా ఎక్కువైంది. అభివృద్ధిచెందిన విజ్ఞానం ఈ హింసా ప్రవృత్తితో కలవడంచేత. మొత్తం మానవ సమాజాన్ని నాశనం చేస్తానని హింసా ప్రవృత్తి సవాలు చేస్తోంది.

ఒక్క ప్రక్క ఇది ఇలా ఉండగా, మరొక ప్రక్క మానవునిలో అభివృద్ధి చెందాలని సహజంగా ఉన్న ప్రేరణవల్ల, తనలోని సంస్కృతిని పెంచుకుంటూ, దానిని శక్తివంతం చేసుకుంటున్నాడు. ఇలా మానవునిలోని సంస్కృతి వికసిస్తోన్నకొద్దీ, తనలోని సంస్కృతియొక్క అసమర్థత కారణంగా ఏర్పడిన దండన శక్తి అవసరం అతనిని బాధించ సాగింది. వికృతిని అణిచి పెట్టుటకు రాజదండన అవసరం కావడం మానవ జాతియొక్క సామూహిక సంస్కృతిని అవమానించడమేనని అతనికి తెలియగానే, రాజరికం నుండి ప్రజాస్వామ్యానికి మారవలెనను ప్రేరణ మానవునికి కలిగింది. దానివల్ల విశ్వమంతటా, దండనశక్తియగు హింసాశక్తి బదులుగా వేరొక సాంస్కృతిక శక్తి కొరకు అన్వేషణ ప్రారంభమైంది. "మానవుడు సంపూ

ష్టంగా దేవత కానంతవరకూ అతను మానవుడుగానే ఉంటాడు. అతను మానవుడుగా ఉన్నంతకాలం అతనిలో వికృతి ఏదో కొంత భాగం ఉండనే ఉంటుంది. అతని సంస్కృతిని ఎంతగా కేంద్రీకరించినా, సంస్కృతికి చెందిన వాతావరణాన్ని ఎంతగా పెంపొందించినా, అప్పుడప్పుడు వికృతియొక్క వికారం బయటపడక మానదు" అనే విషయం ఆ అన్వేషకులకు తెలుసు.

ఇలాంటి స్థితిలో వికృతిని అణిచిపెట్టి సంస్కృతియొక్క జీవితంలోనికి తిరిగి ప్రవేశించే ఉపాయం ఏమిటి అనేది ప్రశ్న. వేలకొద్దీ సంవత్సరాల అనుభవంవల్ల దండనశక్తి అయోగ్యమైనదని ప్రజలు గుర్తించారు. మానవునిలోని చైతన్యయుతమైన ప్రయత్నము నిరంతరము సాంస్కృతిక వికాసమువైపే మొగ్గు చూపుతూ ఉన్నా మరొక ప్రక్క దండనశక్తి ఉపయోగం కారణంగా పోటీలో పుట్టిన హింసవల్ల వికారం పెరుగుతోందనీ ప్రజలకు తెలుసు.

సమాజంలో వికారములను అణచుటకు దండనశక్తి కాక వేరుగా ఏదైనా శాంతియుతమైన సాంస్కృతిక విధానం నేడు కావలసియుంది. అట్టివిధానంవల్ల అప్పుడప్పుడు బయటపడే వికారములకు సమాజంలోని సామూహిక సంస్కృతి జామీనుగా ఉండ గలిగి సమాజంనుండి దండనను శాశ్వతంగా తొలగించుటకు వీలు ఏర్పడుతుంది.

తమ జీవితంలో నిరంతరం ప్రేమ, శాంతి గురించి సాధన చేసినవారూ, వాటి గురించే ఆలోచించినవారూ మాత్రమే ఇటువంటి విధానాన్ని వెతక గలుగుతారు. నేడు మన దేశంలో ఇందుకు తగిన వ్యక్తి వినోబా మాత్రమే. శాంతిసేన గురించి చెప్పడమేకాక,

ఫలితంగా ప్రజాసమూహానికి సుఖాన్నీ, శాంతినీ చేకూర్చడ మను సాకుతో రాజ్యశక్తి అత్యధికంగా శక్తివంతురాలవుతూ వచ్చింది.

జీవించుటకు పడే ఆరాటంలో భవిష్యత్తు గురించి ఇప్పుడే నిశ్చయించు కోవలసిన అవసరం కలుగు తోంది. దాని వల్ల తాను నిశ్చితంగా ఉండాలంటే ధనాన్ని ఎక్కువగా కూడబెట్టడం అవసరమౌతోంది. ఈవిధంగా మానవునిలో కూడబెట్టే ప్రవృత్తి అంతకంతకు ఎక్కువౌతూ వచ్చింది.

అత్యధికంగా ధనాన్ని కూడబెట్టడం. అధికారాన్ని గుప్పిట్లో పెట్టుకోవడం కారణంగా మానవులలో పోటీ ప్రవృత్తి పరాకాష్ట నందుకుంది. దానితోపాటు హింసా ప్రవృత్తి కూడా ఎక్కువైంది. అభివృద్ధిచెందిన విజ్ఞానం ఈ హింసా ప్రవృత్తితో కలవడంచేత, మొత్తం మానవ సమాజాన్ని నాశనం చేస్తానని హింసా ప్రవృత్తి సవాలు చేస్తోంది.

ఒకప్రక్క ఇది ఇలా ఉండగా, మరొక ప్రక్క మానవునిలో అభివృద్ధి చెందాలని సహజంగా ఉన్న ప్రేరణవల్ల, తనలోని సంస్కృతిని పెంచుకుంటూ, దానిని శక్తివంతం చేసుకుంటున్నాడు. ఇలా మానవునిలోని సంస్కృతి వికసిస్తోన్నకొద్దీ, తనలోని సంస్కృతియొక్క అసమర్థత కారణంగా ఏర్పడిన దండన శక్తి అవసరం అతనిని బాధించ సాగింది. వికృతిని అణిచి పెట్టుటకు రాజదండన అవసరం కావడం మానవ జాతియొక్క సామూహిక సంస్కృతిని అవమానించడమేనని అతనికి తెలియగానే, రాజరికం నుండి ప్రజాస్వామ్యానికి మారవలెనను ప్రేరణ మానవునికి కలిగింది. దానివల్ల విశ్వమంతటా, దండనశక్తియగు హింసాశక్తి బదులుగా వేరొక సాంస్కృతిక శక్తి కొరకు అన్వేషణ ప్రారంభమైంది. "మానవుడు సంపూ

ర్ణంగా దేవత కానంతవరకూ అతను మానవుడుగానే ఉంటాడు. అతను మానవుడుగా ఉన్నంతకాలం అతనిలో వికృతి ఏదో కొంత భాగం ఉండనే ఉంటుంది. అతని సంస్కృతిని ఎంతగా కేంద్రీకరించినా, సంస్కృతికి చెందిన వాతావరణాన్ని ఎంతగా పెంపొందించినా, అప్పుడప్పుడు వికృతియొక్క వికారం బయటపడక మానదు" అనే విషయం ఆ అన్వేషకులకు తెలుసు.

ఇలాంటి స్థితిలో వికృతిని అణిచిపెట్టి సంస్కృతియొక్క జీవితంలోనికి తిరిగి ప్రవేశించే ఉపాయం ఏమిటి అనేది ప్రశ్న. వేలకొద్దీ సంవత్సరాల అనుభవంవల్ల దండనశక్తి అయోగ్యమైనదని ప్రజలు గుర్తించారు. మానవునిలోని చైతన్యయుతమైన ప్రయత్నము నిరంతరము సాంస్కృతిక వికాసమువైపే మొగ్గు చూపుతూ ఉన్నా మరొక ప్రక్క దండనశక్తి ఉపయోగం కారణంగా పోటీలో పుట్టిన హింసవల్ల వికారం పెరుగుతోందనీ ప్రజలకు తెలుసు.

సమాజంలో వికారములను అణచుటకు దండనశక్తి కాక వేరుగా ఏదైనా శాంతియుతమైన సాంస్కృతిక విధానం నేడు కావలసియుంది. అట్టివిధానంవల్ల అప్పుడప్పుడు బయటపడే వికారములకు సమాజంలోని సామూహిక సంస్కృతి జామీనుగా ఉండ గలిగి సమాజంనుండి దండనను శాశ్వతంగా తొలగించుటకు వీలు ఏర్పడుతుంది.

తమ జీవితంలో నిరంతరం ప్రేమ, శాంతి గురించి సాధన చేసినవారూ, వాటి గురించే ఆలోచించినవారూ మాత్రమే ఇటువంటి విధానాన్ని వెతక గలుగుతారు. నేడు మన దేశంలో ఇందుకు తగిన వ్యక్తి వినోబా మాత్రమే. శాంతిసేన గురించి చెప్పడమేకాక,

దానికి నాయకత్వంకూడా వహించగలనని ఆయన ప్రకటించడం ప్రపంచానికి ఒక శుభ సూచన.

నేడు ప్రపంచమంతా విధ్వంసం అనే అగ్ని పర్వతంమీద కూర్చుని ఉంది. ఇట్టి సమయంలో ప్రతీ వ్యక్తి శాంతి సేనను గురించి లోతుగా ఆలోచించాలి. వినోబాజీ అభిప్రాయాలు మనకు ఆవిధంగా ఆలోచించుటకు ఏకైక సాధనంగా నేడు మనముందున్నాయి. ఈ పుస్తకంవల్ల కోట్లకొలదీ ఉన్న దేశవాసులకు, ఇతరులకూ కూడా ఈ రీతిలో ఆలోచించుటకు ప్రేరణ లభించ గలదని నమ్ముతున్నాను.

శ్రీమభారతి
ఖాదీగ్రామం
15—10—57

ధీరేంద్ర ముజుందార్

ర్ణంగా దేవత కానంతవరకూ అతను మానవుడుగానే ఉంటాడు. అతను మానవుడుగా ఉన్నంతకాలం అతనిలో వికృతి ఏదో కొంత భాగం ఉండనే ఉంటుంది. అతని సంస్కృతిని ఎంతగా కేంద్రీకరించినా, సంస్కృతికి చెందిన వాతావరణాన్ని ఎంతగా పెంపొందించినా, అప్పుడప్పుడు వికృతియొక్క వికారం బయటపడక మానదు" అనే విషయం ఆ అన్వేషకులకు తెలుసు.

ఇలాంటి స్థితిలో వికృతిని అణిచిపెట్టి సంస్కృతియొక్క జీవితంలోనికి తిరిగి ప్రవేశించే ఉపాయం ఏమిటి అనేది ప్రశ్న. వేలకొద్దీ సంవత్సరాల అనుభవంవల్ల దండనశక్తి అయోగ్యమైనదని ప్రజలు గుర్తించారు. మానవునిలోని చైతన్యయుతమైన ప్రయత్నము నిరంతరము సాంస్కృతిక వికాసమువైపే మొగ్గు చూపుతూ ఉన్నా మరొక ప్రక్క దండనశక్తి ఉపయోగం కారణంగా పోటీలో పుట్టిన హింసవల్ల వికారం పెరుగుతోందనీ ప్రజలకు తెలుసు.

సమాజంలో వికారములను అణచుటకు దండనశక్తి కాక వేరుగా ఏదైనా శాంతియుతమైన సాంస్కృతిక విధానం నేడు కావలసియుంది. అట్టివిధానంవల్ల అప్పుడప్పుడు బయటపడే వికారములకు సమాజంలోని సామూహిక సంస్కృతి జామీనుగా ఉండగలిగి సమాజంనుండి దండనను శాశ్వతంగా తొలగించుటకు వీలు ఏర్పడుతుంది.

తమ జీవితంలో నిరంతరం ప్రేమ, శాంతి గురించి సాధన చేసినవారూ, వాటి గురించే ఆలోచించినవారూ మాత్రమే ఇటువంటి విధానాన్ని వెతకగలుగుతారు. నేడు మన దేశంలో ఇందుకు తగిన వ్యక్తి వినోబా మాత్రమే. శాంతిసేన గురించి చెప్పడమేకాక,

దానికి నాయకత్వంకూడా వహించగలనని ఆయన ప్రకటించడం ప్రపంచానికి ఒక శుభ సూచన.

నేడు ప్రపంచమంతా విధ్వంసం అనే అగ్ని పర్వతంమీద కూర్చుని ఉంది. ఇట్టి సమయంలో ప్రతీ వ్యక్తి శాంతిసేనను గురించి లోతుగా ఆలోచించాలి. వినోబాజీ అభిప్రాయాలు మనకు ఆవిధంగా ఆలోచించుటకు ఏకైక సాధనంగా నేడు మనముందున్నాయి. ఈ పుస్తకంవల్ల కోట్లకొలదీ ఉన్న దేశవాసులకు, ఇతరులకూ కూడా ఈ రీతిలో ఆలోచించుటకు ప్రేరణ లభించ గలదని నమ్ముతున్నాను.

శ్రమభారతి
ఖాదీగ్రామం
15—10—57

ధీరేంద్ర ముజుందార్

———

# శాంతి సేన

*మహాత్మా గాంధీ*

హింసాయుతమైన సేన యుద్ధ సమయాలలో మాత్రమే పనిచేయగలుగుతుంది. శాంతిసేన మాత్రం యుద్ధ సమయం లోనూ, శాంతి సమయంలోనూ కూడా పని చేయగలుగుతుంది. శాంతి సమయంలో శాంతిసేన నిర్మాణకార్యక్రమాలను చేపట్టి పనిచేస్తూ ఉంటుంది. దానివల్ల ఉపద్రవాలు, కొట్లాటలు అనవసరము, అసంభవము కాగల వాతావరణం ఏర్పడుతుంది. ఎప్పుడూ కలహించుకునే మతాలు, కులాలు పరస్పరం సన్నిహిత మవ్వాలనీ, శాంతి ప్రచారం సాగాలనీ, ప్రతి వ్యక్తీ- స్త్రీగాని, పురుషుడుగాని, పెద్దలుగాని, పిన్నలుగాని పరస్పరం నిరంతరం ఇరుగు పొరుగున శాంతి వాతావరణం ఏర్పరచుకుని జీవించగలుగునట్లు ప్రయత్నించాలనీ శాంతిసేన సదావాంఛిస్తూ ఉంటుంది. అట్టి అవకాశముల కొరకు శాంతిసేన ప్రయత్నిస్తుంది. ఇట్టి శాంతిసేన ఎట్టి ప్రమాదాలనైనా సరే ఎదుర్కొనుటకు సిద్ధంగా ఉండాలి; అంతేగాక ప్రజలలో చెలరేగిన క్రోధాగ్ని జ్వాలలను చల్లార్చుటకుగాను అవసరమైతే తమ ప్రాణాలనైనా ఒడ్డి పనిచేయుటకు వెనుకాడరాదు. ఇటువంటి కొన్ని వందల మందిగాని, వేలమందిగాని చేయగల పరిశుద్ధమైన బలిదానముతో ఈ కలహాలను శాశ్వతంగా అంతమొందించగలవు.

సాధారణంగా 'భీభత్సం' ఏర్పడగల చిహ్నాలు ముందు నుంచే గోచరిస్తాయి. ఈ చిహ్నాలు గోచరించగానే, భీషణాగ్ని

జ్వాలలు విరాట్ రూపం తీసుకుని వ్యాపించకముందే, పరిస్థితిని ఆరంభంలోనే అదుపులో పెట్టుటకు శాంతిసేన కృషి చేస్తుంది. ఈ ఉద్యమం విస్తృతంగా వ్యాపిస్తే మంచిదే. అప్పుడు తమ పూర్తి సమయాన్ని ఈ కార్యము కొరకే వెచ్చించగల కార్యకర్తలు కొందరు ముందుకు రాగలుగుతారు. అయితే నేను ఆశిస్తున్నట్లు ఇలాగే జరగాలని ఎక్కడా లేదు. ఈ ఉద్దేశాలు, ఆశయాలు కలిగి, ఇందుకై కృషిచేయగల చక్కని స్త్రీ-పురుషులు అత్యధికంగా తయారు కావలె ననునదే మన లక్ష్యము కావాలి.



# శాంతి సైనికునికి శిక్షణ

*మహాత్మా గాంధీ*

హింసాయుత విధానంలో శిక్షణ పొందుటయందు ఇతరులను హత్యచేసే కళను నేర్చుకొనవలసిన అవసరం ఉన్నట్లే, అహింసాయుత విధానంలో శిక్షణపొందుటయందు ఆత్మసమర్పణ గాను కళను నేర్చుకొనవలసియున్నది.

అహింస కేవలము ఉన్నతస్థాయికి చెందిన ప్రజలు మాత్రమే ఆచరించదగినది అను భావానికి నేను వ్యతిరేకిని. అంతేకాదు, అవసరమగు శిక్షణ నిస్తే, నాయకత్వం సక్రమంగా ఉంటే సాధారణ ప్రజానీకం అందరూ కూడ అహింసను అభ్యసించగలరు అని నా గట్టి నమ్మకము.

హింసాయుత సైన్యమునకు నేర్పే ప్రాథమిక శిక్షణలోని కొంత భాగము శాంతి సైనికులకు కూడ అవసరము. క్రమశిక్షణ, డ్రిల్లు, బృందగానము, పతాకవందనము మొదలైనవి ఆ భాగాలు.

క్షతగాత్రులను ఇతరులనుండి వేరు చేసి బయటకు ఎలా తీసుకు వెళ్ళాలి అనే విషయం ప్రతీ స్వయంసేవకునికీ తెలిసి ఉండవలసినదే. ప్రాథమిక చికిత్సకు అవసరమైన బ్యాండేజీగుడ్డ, దూది, కత్తెర, సూది, దారం, శస్త్రక్రియ కవసరమైన చాకు మొదలైన వాటిని ప్రతీ స్వయంసేవకుడూ తన వెంట ఉంచు

తోనవలెను. నిప్పును ఆర్పడం ఎలా, ఒళ్ళు కాల్చుకోకుండా మంటల్లోకి ఎలా వెళ్ళాలి, సామాను పుచ్చుకుని గాని లేక సామాను లేకుండాగాని రక్షణకొరకు ఎత్తులు ఎలా ఎక్కాలి, మరల సురక్షితంగా ఎలా దిగాలి- మొదలైన విషయాలు ప్రతి ఒక్కరికీ తెలిసి ఉండాలి.

శాంతి సైనికునికి ఈశ్వరునియందు ప్రగాఢమైన విశ్వాసము ఉండుట అవసరము. అల్లే శాంతి సైన్యముయొక్క అధినేత ఆజ్ఞలను స్వచ్ఛందముగానూ, సంపూర్ణంగానూ పాలించాలి. శాంతిసేనయొక్క వివిధ విభాగముల మధ్య ఆంతరంగికంగానూ, ప్రత్యక్షంగానూ పూర్తిగా పరస్పర సహకారం ఉండాలి.

ఇటువంటి సంఘటనలయందు సర్వసాధారణంగా అత్యంత అవసరమైన విషయం దైవ నమ్మిక. దైవమందు విశ్వాసము లేకపోతే ఈ శాంతి దళములు మృత్యు తుల్యము లౌతాయి.

మనం ఊహించే శాంతిసేనలో చేరగల సభ్యులకు ఎట్టి యోగ్యతలు ఉండాలి అను విషయం మనం చూడ వలసి యుంది.

1. శాంతిసేన సభ్యులకు, వారు పురుషులుగాని– స్త్రీగానీ, అహింస యందు సజీవమైన నమ్మకం ఉండాలి. ఈశ్వరుని యందు సజీవమైన నమ్మకం ఉన్నప్పుడే అది సాధ్యం కాగలుగుతుంది. ఈశ్వర కృప, ఈశ్వర శక్తిలేకుండా అహింసాత్మక సైనికుడు ఏ పనీ చేయజాలడు. అలా కాకపోతే క్రోధం, భయం,

ప్రతీకారం అనే భావనలనుండి ముక్తి పొంది, మరణమంటే వెరువకుండుటకు అవసరమగు సాహసము రావాలదు. అందరి హృదయాలలోను ఈశ్వరు డున్నాడు, ఈశ్వరు డుండగా భయ పడవలసిన అవసరమేదీ లేదు అను నమ్మకముసుండే పై నుద హరించినట్టి సాహసం రాగలుగుతుంది. ఎవరినైతే విరోధులనీ, గూండాలనీ అనుకుంటామో వారి ప్రాణాల రక్షణ గురించి మనమే శ్రద్ధబూనుట కూడ ఈశ్వరుని సర్వవ్యాపకత్వమును గురించి తెలుసుకొనుటకు ఒక అర్థమై యుండి. మానవునిలో నిహితమైయున్న పశుప్రవృత్తి అతనిని వశపరచుకొనియున్న సందర్భములో, అతనిని ఆవహించియున్న క్రోధమును శాంతింప చేయుటకు ఈ విధముగా బుద్ధిపూర్వకముగా జోక్యము కలి గించుకొనుట ఒక విధానము.

2. ఈ శాంతిదూతకు ప్రపంచంలోని అన్ని ముఖ్య ధర్మములయెడల సమానమైన గౌరవభావం ఉండాలి. అందుకు గాను ఈ శాంతి సైనికుడు హిందువు అయినట్లయితే, భారత దేశంలో వ్యాపించియున్న ఇతర అన్ని ధర్మములనూ గౌర వించాలి. కనుక దేశంలో అనుసరింపబడుచున్న విభిన్న ధర్మ ముల సాధారణ సిద్ధాంతములను, తత్వములను అతను తెలుసు కొని ఉండాలి.

3. ఈ పని ఒంటరిగాగాని లేక దళములుగా ఏర్పడిగాని చేయవచ్చును. కనుక ఎవరూ మరియొకరి కొరకు నిరీక్షించవలసిన

అవసరములేదు. అయినప్పటికీ సహజంగానే ప్రతీ వ్యక్తి తన బస్తీ నుండి కొంతమంది సహచరులను కూడగట్టుకుని స్థానికంగా సేనను నిర్మించుకొనగలడు.

4. ఈ శాంతిదూతతన బస్తీలోగాని లేక, తానెన్నుకొన్న కార్యక్షేత్రంలోగాని వ్యక్తిగత సేవద్వారా ప్రజలతో సంబంధం పెట్టుకోవాలి. దానివల్ల అవాంఛనీయ, అసహ్యాకర పరిస్థితు లేర్పడినప్పుడు, ఉపద్రవకారులకు ఈ వ్యక్తి అనుమానించదగిన పరాయివాడుగా, అప్రియమగు వ్యక్తిగా కనబడకుండా ఉండ గలడు.

5. శాంతికొరకు పనిచేయు దలచుకొన్న వ్యక్తి ఎవరూ వేలుపెట్టి చూపుటకు వీలులేనట్టి శీలము కలిగి, నిష్పక్షపాత వైఖరికి పేరు పొందినవాడై ఉండవలెనని వేరుగా చెప్పవలసిన అవసరము లేదు గదా.

6. సాధారణంగా కొట్లాటలకు ముందుగానే 'తుపాను' చెలరేగ గల హెచ్చరిక లభిస్తుంది. అట్టి సూచనలు కనబడగానే, ద్వేషాగ్ని రాజుకునేవరకూ నిరీక్షించకుండా, వెంటనే పరిస్థితిని అదుపులో ఉంచుటకు శాంతిసేన పని ప్రారంభించాలి.

7. ఈ ఉద్యమం పెరిగి పెద్దదైనప్పుడు పూర్తి సమయం వెచ్చించి ఇందుకొరకే పనిచేయగల కార్యకర్తలు కొందరు ప్రత్యేకంగా ఉండుట మంచిది కాగలదు. అయితే స్థితి ఆరీతినే రూపొందవలసిన అవసరం లేదు. మంచి స్త్రీ పురుషులు ఎందరు లభిస్తే అందరినే ఈ కార్యరంగమందు ప్రవేశ పెట్ట

వచ్చు. జీవితంలోని వివిధ కార్యక్రమాలతో సంబంధం కలిగి, తమ ప్రాంతంలోని ప్రజలతో సంబంధాలు పెట్టుకొనుటకు తగినంత వ్యవధి కలిగియుండి, శాంతిసైనికునికి ఉండవలసిన యోగ్యతలు కలిగియున్నవారు స్వయం సేవకులుగా లభించి నప్పుడే పూర్తిసమయం కార్యకర్తలు లభించగలరు.

8. ఈ సైన్యం సభ్యులకు ఒక నిశ్చితమైన దుస్తులు ఉండాలి. దానివల్ల అవసరమైనప్పుడు తేలికగా వారిని గుర్తించు టకు వీలు ఏర్పడ గలుగుతుంది.

ఈ సూచనలు సామాన్యమైనవి. వీటి ఆధారంపై ప్రతీ కేంద్రమూ తన నియమావళిని ఏర్పరచుకోవచ్చును.

పునాది నుండి భవనమువరకూ నిర్మాణము చేయుటే అన్నిటికంటే మంచిదీ, శీఘ్రమైనదీ, అమోఘమైనదీ అగు మార్గము. ప్రజల మనస్సు నేడందుకు సిద్ధముగా ఉన్నది. గ్రామాలకు మరలుటే అన్ని విధాలా అత్యంత అవసరమైనదిగా కనబడుతోంది. వస్తూత్పత్తి-వితరణ కొద్ది కేంద్రాలలోనే కొన సాగే బదులు లక్షలాది గ్రామాలకు దానిని వ్యాపింప జేయవల సిన సమయమిది. ప్రతీ గ్రామాన్నీ ఒక స్వయం సంపూర్ణమైన ప్రజాస్వామ్యరాజ్యంగా రూపొందించుట ఎంతేని అవసరము. ఇందుకు పరాక్రమాన్ని ప్రదర్శించే తీర్మానాలు అవసరంలేదు. దీనికి అవసరమైనదల్లా, సాహసంతోనూ, ధైర్యంగానూ, తెలివి తేటలతోనూ పనికి పూనుకోవాలి.

——:(o):——

# శాంతిసేన ఆవశ్యకత

*వి నో బా*

నేడు ప్రపంచమంతనూ వేధిస్తున్న మూలమైన సమస్య శాంతిస్థాపనకు సంబంధించిన సమస్య. నేడు ప్రపంచంలో శాంతి కొరకు ఏర్పడినంత తహ తహ ఇంతకు ముందెన్నడూ ఏర్పడి యుండలేదు. నిన్న–మొన్నటివరకూ హింసాయుత తత్వమందే మునిగియున్న దేశాలుకూడ నేడు హింసనుండి విముక్తులవ్వా అని ప్రయత్నిస్తున్నాయి. నేటికీ ఒకప్రక్క అయా దేశాలు ఆయుధాలను పెంచుకుంటూన్నప్పటికీ, మరొక ప్రక్క వాటినుండి ముక్తి ఎలా లభించగలదా అని ఆలోచిస్తున్నాయి. ఇందుకే శాంతిసేన ప్రసక్తి.

నిఖిల మానవ కోటికీ సేవచేయాలనుకునే వారే శాంతి సేనలో సేవకులుగా ఉంటారు. అందరూ కలిసి భారత దేశాన్ని ఎదుర్కొంటున్న దుఃఖాన్ని నివారిస్తారు. అందు మతం, కులం, పార్టీ, వర్గం అనే తేడాలుండవు. ఇందుకవసరమైన శిక్షణ వారికివ్వాలి. భారతీయ తత్వము, సమన్వయ తత్వము వారికి అర్థం కావాలి. రకరకాలుగా సేవ ఎలా చేయుటో వారికి నేర్పాలి. ప్రతీ 5 వేలమంది జనాభాగల గ్రామానికీ ఒక సేవకుడుండాలి. అతను నిరంతరం సేవ చేస్తూ ఉంటాడు. బాధితుల దుఃఖం నివారిస్తూ ఉంటాడు. ఎవరైనా జబ్బుపడితే, ఆ రోగికి సేవ చేస్తాడు. సాహిత్య ప్రచారం చేస్తాడు. ప్రజల బాధలను

తెలుసుకొని వాటిని నివారించుటకు ప్రయత్నిస్తాడు. ఈ విధంగా ప్రతీ వ్యక్తి హృదయంలోనూ ప్రవేశించి వారి ఇంటిలో ఒక ఆత్మీయునిగా తయారౌతాడు. ఎప్పుడైనా ఎక్కడైనా గలాటాలు జరిగితే, అవసరమైతే తనను తాను బలిదానంగా సమర్పించుకుంటాడు.

ఈ విధంగా శాంతిసైనికుడు నిరతమూ ప్రజాసేవ చేస్తూ నిమిత్తమాత్రంగా శాంతికార్యం కొనసాగిస్తూ ఉంటాడు. ఇట్టి నిష్కామ, స్వార్థరహిత, నిస్పృహ, నిరపేక్ష సేవకుల సైన్యం సమకూరాలి.

అన్ని ధర్మాలూ కూడా శాంతియందు శక్తి ఉందని అంగీకరించాయి. "వైరం పెట్టుకోరాదు, శత్రువును ప్రేమతో జయించాలి; చేత కత్తిబట్టినవారు ఆ కత్తివలననే నాశనం కాగలరు" అని ఏసుక్రీస్తు చెప్పారు.

నేటి ప్రపంచ పరిస్థితి అహింసకు అనుకూలంగా మారింది. నేడు హింస చెంపదెబ్బలు, లాఠీలు, కత్తులు వరకూ పరిమితమై లేదు. అది ఎంతో వికసించింది. ప్రపంచంలోని ప్రజానీకం మన శత్రువులు అనే భావం మనలో అంకురించిందంటే, ఆ భావమే ప్రపంచాన్ని పూర్తిగా నాశనం చేస్తుందని మనం గుర్తించాలి. ఇందుకే మనం శాంతిశక్తిని రూపొందించాలి. శాంతి కేవలం ఆకర్షణీయమైన శక్తి మాత్రమేకాదు; జీవితంలో రుచిని కలిగించు తారక, ప్రేరక, రక్షక శక్తి అనే నమ్మకం ప్రజలలో

ఏర్పడాలి. నేడు కరుణ ఇంటిలో బంధింపబడి ఉంది. ఎక్కువలో ఎక్కువ ఇరుగు పొరుగువారి వరకూ వ్యాపించింది. శత్రువుని చూచి మాత్రం కంగారు పడుతుంది. ప్రేమతోనూ, కరుణ తోనూ శాంతితోనూ జయించగలం అను సత్యాగ్రహ శక్తిపై ప్రజలలో నమ్మకం ఏర్పడనంత వరకూ, ప్రపంచంలో అటం బాంబులే ఆధిపత్యం వహిస్తాయి, అటంబాంబులు కలవారిదే పై చేయిగా ఉంటుంది.

కరుణ ఎప్పుడూ జడం కాదు; అది ఆక్రమణ చేయగలిగి నదే. కరుణకు మూడు గుణాలున్నాయి

1. అది ఎవరికొరకూ నిరీక్షించదు తానై పయనించి పోతుంది.
2. అది భేదభావముల నెరుగదు.
3. అది స్వీయప్రేరణ (ఇనీషియేటివ్) ను తన వద్దనే ఉంచుకుంటుంది.

నేటి మన సమాజంలో కరుణ లేదా? ఉంది; కాని అది సజీవంగా లేదు. స్వయంగా వెళ్ళి ఇతరుల దుఃఖమును నివారించేందుకు ప్రేరణ దానిలో లేదు. బాధితుడు స్వయంగా వచ్చి తన దుఃఖాన్ని ప్రకటించుకున్నప్పుడే మన హృదయం కరుగుతుంది. ఇది సజీవమైన కరుణ కాదు. చివరి శ్వాసాలు లెక్కపెడుతూ మరణాసన్నమై యున్న శేషాంశము. తానై స్వయంగా కదలలేదు. నిజానికి అట్టిది కరుణే కాదు.

నేటి కరుణలో స్వీయప్రేరణ (ఇనీషియేటివ్) లేనే లేదు ఒక ప్రక్కనేమో పాకిస్తాన్ సేనను పెంచుకుంటోంది. మన విధానం శాంతి విధానం. అందుచేత మనం సేనను ఎక్కువ చేయాలని అనుకోవడం లేదు. అయినా చేసేదేముంది. అటు పాకిస్తాన్ ఆయుధాలతో సన్నద్ధమౌతోంది కనుక మనమూ సైన్యాన్ని పెంచితీరాలి. అంటే మన జాతీయ ప్రణాళికను పాకిస్తాన్‌ను దృష్టిలో పెట్టుకుని రచించాలన్నమాట. అందరూ భయపడుతున్నారు. సైన్యాన్ని పెంచాలంటున్నారు. కాని, యదార్థానికి మనం సైన్యాన్ని తగ్గించుకోవాలి. ఆ సాహసం చేయలేనిది కరుణ కాజాలదు. పిరికిపందగా తయారయ్యే కరుణ, క్రూరత్వానికి స్థానమిచ్చే కరుణ కరుణ కాదు. అందులో మనం కరుణయొక్క స్వీయప్రేరణ (ఇనీషియేటివ్)ను పోగొట్టుకున్నాము.

నేడు కరుణ దాసీగా తయారైంది. కరుణ యుద్ధాన్ని ఆపగలిగితేనే అది నిజమైన కరుణ అవుతుంది. భూదానం, గ్రామదానం ద్వారా మేము నిజమైన కరుణను పెంపొందించా లనుకుంటున్నాము. మా కరుణ ద్వారా మేము పాకిస్తాన్‌ను మిత్రునిగా చేసుకొనెదము. మా కరుణ ద్వారా మేము అణు, ఉదజని బాంబులనే నాశనం చేయగలము. గ్రామదానం ద్వారా కరుణయొక్క ఇట్టి శక్తిని కలిగించాలని మా ప్రయత్నము. ఇందుకు గాను శాంతిసేనను నిర్మించాలనుకుంటున్నాము.

"శాంతిసేన" అనే శబ్దాన్ని గమనించండి. నేడు అందరూ శాంతికావాలి — శాంతికావాలి అని చెబుతూనే ఉన్నారు. కాని, పాపం ఆ శాంతికి ఏదిక్కూ తోచడంలేదు. శాంతికి ఆక్ర మించే శక్తి లేకపోతే అది నిస్సహాయురాలౌతుంది. అందుకే మేము శాంతితో పాటు సేన అనే పదమునూ జోడించాము.

నేడు బలంగల రాజ్యాలుగా పేరుపొందుచున్నవి యుద్ధానికి చాల పిరికిపందలు. అందుకే ఆయుధ విసర్జన గురించి మాట్లాడుతున్నారు. గాంధీజీ అవతరించారు. ఆయుధాలు లేకుండా యుద్ధం చేయడమేలాగో ఆయన మనకు నేర్పారు. మన ఈ దేశం ఏ ఆయుధాలూ చేపట్టకుండానే 'క్విట్ ఇండియా' అని చెప్పగల సాహసం చేసింది. ఇంతవరకూ పురుషులే తుపాకి పట్టేవారు. ఇప్పుడు స్త్రీలుకూడ చేత తుపాకి ధరించడం మొదలుపెట్టారు. పురుషులు తుపాకి పడితేనే మూడు మహా సంగ్రామాలు జరిగాయి. ఇప్పుడు మరి అందుకు రెట్టింపు జరుగుతాయేమో? ఇదే వరస కనుక సాగితే ఈ ప్రపంచం రక్షింపబడే దెలా? అందుకే మేము శాంతిసేన ప్రసక్తి తెచ్చాము. ప్రజలు ఎలాగూ అశాంతిసేన నిర్మిస్తూనే ఉన్నారు. దానికి గాను ప్రభుత్వం విధించిన పన్నులు ప్రజలు కడుతున్నారు. అందుచేతనే సత్కార్యాలకు ప్రజలు దాన మివ్వాలని మేము కోరుతున్నాము. పన్నుల బదులు ప్రజలు దానమివ్వాలి. అశాంతిసేన బదలు శాంతిసేనను నిర్మించాలి.

నేడు ప్రబలియున్న పార్టీ, జాతి, మత, కులభేదములను నిర్మూలించాలి. మానవ ధర్మాన్ని స్థాపించాలి. అందుకుగాను శాంతి సేన నిర్మాణము అవసరము. అది ఎట్టి సైన్యం అవుతుంది? దాని ఆయుధాలేమిటి? ప్రేమయే దాని ఆయుధము. ఎక్కడైనా కలహాలూ-కొట్లాటలూ జరిగితే వాని మధ్య చావుకైనా సిద్ధపడడం శాంతి సేనకు శిక్షణ. శాంతి సేన ఎల్లప్పుడూ చేసే పని ఏమిటి? గ్రామ గ్రామాలలో సేవచేస్తుంది. బాధితులకు, పీడితులకు సేవ. ఎవ రెవరు అపదల్లో ఉంటారో వారందరికీ సేవ చేస్తుంది. సాధారణంగా సేవా సైన్యంగా ఉంటుంది; అవసరం వచ్చినప్పుడు శాంతి సైన్యంగా పనిచేస్తుంది. ఈ విధమైన శాంతి సేనను మేము నిర్మించాలనుకుంటున్నాము.

మన శాంతిసైనికుడు ఎలా ఉంటాడు? అందరి యెడలా సమతా భావంతో వ్యవహరించే వాడౌతాడు. హెచ్చు తగ్గుల భేదం ఉండదు. నీటివలె నమ్రంగానూ, మృదువుగానూ, స్వచ్ఛంగానూ, నిర్మలంగానూ, శీతలంగానూ ఉంటాడు. నీటి స్వభావాన్ని జ్ఞానేశ్వరుడు ఈ విధంగా వర్ణించాడు. నీరు ఎంతమృదువుగా ఉంటుందంటే కంటిలోనికి వెళ్ళినా అది కష్టపెట్టదు. అయినప్పటికీ అది ఎంత సత్యనిష్ఠ కలిగినదంటే రాళ్లనుకూడా పగలగొడుతుంది. అది ఎదుటివానిపై దెబ్బతీయదు. నీరు రాతిమీద పడిందంటే, స్వయంగా తాను బిందువులుగా చిందరవందర అవుతుంది, రాతినీ పగలగొడుతుంది, అది బిందువౌతుంది. నమ్రత చూపుతుంది. దాని మృదుత్వం, నమ్రతల

శక్తి వల్ల రాయి పగులుతుంది. మన శాంతిసైనికులు నీటివలే ఈ విధంగా తయారౌతారు. వీరు అశాంతి నిర్మూలించే వారు గదా. అలాంటప్పుడు వారి వాణిలోగానీ, వ్యవహారంలోగాని అశాంతి ఎలా ఉండగలుగుతుంది? ఇట్టి సేవాపరాయణులైన, పక్షాతీతులైన, వినమ్రులైన సేవకులు ప్రతీ గ్రామంలోనూ ముందుకు రావాలి.

*శాంతిసైనికుని ప్రతిజ్ఞ* తీసుకోవడం అంటే ఏమిటి? తమ జీవిత సర్వస్వాన్ని, ప్రాణాన్ని జనసేవకు అర్పిస్తున్నారని అర్థం: మీకు సేవ చేయుటలో వారు ఏ విధమైన తేడాలనూ చూడరు. సత్యాహింసల మార్గాన పయనించుటకు ప్రయత్నిస్తారు. ప్రజలనూ ఆదారిన తీసుకు వెళతారు.

ప్రేమకు ప్రతిగా ప్రేమను ప్రకటిస్తే అందులో ఏమీ గొప్పతనం లేదు. ద్వేషానికి ప్రతిగా ప్రేమ చూపబడితేనే అందు గొప్పతనం, ప్రత్యేకత ఉన్నాయి. ఇది చాల విచిత్రంగా తోచవచ్చు. కాని ఇది శక్తియొక్క లక్షణము. దీనిలోని సుళువును మనం తెలుసుకోవాలి. ద్వేషం వ్యాపించిన చోటల్లా మనం ప్రేమను ప్రకటిస్తూ పోవాలి. దీనినే ధర్మం అంటారు. ఎదట ఎంత ద్వేషం ఉంటే అంతగా ప్రేమ ప్రకటం కావాలని తేలికగానే తెలుసుకోగలం. అయితే దానిని ఎలా ఉపయోగిస్తాము? అందుకే మేము శాంతిసేన విషయమై ప్రస్తావిస్తున్నది. శాంతిసేన అన్ని ద్వేషాలను తన కడుపులో దాచుకుంటుంది. సూర్యోదయం కాగానే చీకటి తొలగడం లేదా?

ఆస్పత్రి సంగతే చూడండి. అక్కడ ఎవరైనా సరే సేవ చేస్తారు. ఏ మతం, ఏ కులం, ఏ పార్టీ - అతను మంచివాడా, చెడ్డవాడా అని చూడరు. అందరికీ సేవ చేస్తారు. అతను బాధ పడుతున్నాడనే దొక్కటే వారు చూచేది. చెడ్డవానికి మందిచ్చి బాగు చేస్తే తిరిగి అతను చెడుపనులే చేస్తాడేమో, అందుకని మందు బదులు విషం ఇద్దామని అక్కడివారు అనుకోరు. రోగి ఎవరైనా సేవ చేయడం తమ ధర్మంగా ఎంచి సేవ చేస్తారు. అందుకే ప్రజలకు ఆస్పత్రులంటే నమ్మకం, గౌరవం ఉంది. అలాగే నిష్కామంగా, పక్షాతీతంగా, ప్రతి ఫలాపేక్ష లేకుండా సేవ చేసే సైన్యా నొకదాన్ని మనం తయారు చేయాలి. ద్వేషానికి ప్రతిగా ప్రేమను ఆచరణలో చూపుటయే దాని వృత్తి కాగలదు. ద్వేషానికి ప్రతిగా ప్రేమను చూపి, ఆద్వేషాన్ని ప్రేమతో స్వీకరించి ఆలింగనం చేసుకొన గలగడం చిన్న విషయం కాదు. మనం ఈ రోజున ఈ విధంగా చేయడం లేదు. ఇప్పుడు చెయ్యవలసిన అవసరం ఎంతైనా ఉంది. అలా మనం చేయడం ప్రారంభించినప్పుడు ఇతరులందరూ సాయపడతారు. సైన్యంలో అందరూ చేరరు గదా. కొందరు చేరతారు. మిగిలినవారు వారికి సహాయం చేస్తారు. వీరు తమ రక్షకులని ప్రజలనుకుంటారు. ద్వేషంపై ప్రేమతో దండయాత్ర జరుపుటకు అందరూ సిద్ధపడక పోవచ్చును. కాని అందుకు సహాయ పడుటకు మాత్రం అందరూ ముందుకు రాగలరు. త్యాగము, ప్రేమ, స్నేహము - ఇవే శాంతిసైనికుని చేతిలో ఉండగల

ఆయుధాలు. ద్వేషం ఉదయించిన చోటల్లా ప్రేమతో శాంతిని స్థాపిస్తాం. అలాంటి సైన్యానికి అందరూ తోడ్పడతారు.

మేము ఈ భారత దేశంలో ప్రేమ శక్తిని చూపాలను కుంటున్నాము. ప్రేమ ద్వారా ఇచటి సమస్యలు పరిష్కరింప బడితే మొత్తం ప్రపంచం ఉద్ధరింప బడ గలుగుతుంది. ప్రేమ శక్తి ప్రకటం కావాలని ప్రజలు కోరడం లేదా? హింసా శక్తి నేడు ఇక ప్రకటం కాలేదు. అది మూర్ఖమైన శక్తి. విజ్ఞానం కారణంగా హింసా శక్తి ఎవరికైనా అందగలుగుతుంది. కను కనే హింస ద్వారా సమస్యలు పరిష్కారం కావని అనిపిస్తోంది. ఈ స్థితిలో ప్రేమను ఆచరించి అమలు జరిపే రోజులొచ్చాయి.

వేదాలు, కురాను, బుద్ధుడు, ఏసు క్రీస్తు - అన్నీ, అందరూ ప్రేమ గురించి బోధించారు; అయినా ప్రేమ అమలు లోనికి రాలేదు గదా; ఇక ఇప్పుడు ఏమౌతుంది, అని అడుగు తున్నారు. ఆ సమయంలో ప్రజల మనస్సు అందుకు సిద్ధంగా లేదు కనుకనే ఆ రోజుల్లో కాలేదు. కాని నేడు విజ్ఞానం కార ణంగా ప్రజల మనస్సు ఇందుకు అనుకూలంగా తయారైంది.

నేటి స్థితిలో గ్రామ దానంకంటే శాంతిసేన ఎక్కువ అవసరంగా ఉంది. శాంతిసేనలో మరుగుపడిన శక్తి ఒకటి ఉంది. అది బయట పడితే ప్రపంచ సమస్యలు తేలికగా పరిష్క రింప బడతాయి. అందుకే మేము శాంతిసేనను నిర్మించా

లనుకుంటున్నాము. *భారత దేశంలో శాంతిసేన నిర్మింప బడాలి అనేది మహాత్మాగాంధీ కోరికై యుండెను.* అందుకొరకు చాల ప్రయత్నం కూడ చేశారు. అయితే అప్పుడు ఆయన సహచరులం బలహీనంగా ఉంటిమి. కాని ఆయన మరణించిన తర్వాత మనం ఏమిచేస్తున్నాము? మహా పురుషుల ఆత్మ శరీరంలో ఉన్నప్పుడు ఏపని యైతే చేసిందో, అంతకంటె ఎక్కువగా అది ముక్తి నొందినప్పుడు చేస్తుంది. అందుచేతనే గాంధీజీ శరీరంలో ఉన్నప్పుడు జరిగిన పని కంటే ఎక్కువ పని ఇప్పుడు జరుగుతోంది. వారు శరీరంలో ఉండి చేసే పనులు ప్రజలు అప్పుడు చూడలేరు. భిక్షురూపంలో పరమేశ్వరుని ఆశీర్వాదం లభించదని నేను చెప్పాను. అలాగే నేడు ఇక్కడ గాంధీజీ ఉన్నట్లుగానే నేను భావిస్తున్నాను.

——:(o):——

# శాంతిసేన - సేవాసేన

*వి నో బా*

గ్రామదానం జరిగింది. ఇక గ్రామరాజ్యాన్ని రక్షించుకొనుట గురించి యోచించాలి. దేశంలో ఏర్పడిన గ్రామరాజ్యాన్ని రక్షించుకొనుటకు శాంతిసేనను ఏర్పరచుకోవాలి.

నేను లెక్కవేసి చూశాను. 5 వేల జనాభాకు సేవ చేయుటకు ఒక శాంతిసైనికుడు కావాలి. అంటే 35 కోట్ల జనాభాకు సేవ చేయుటకు గాను దేశంలో 70 వేల మంది శాంతి సైనికులు కావాలి. ఇదేమీ పెద్ద సంఖ్య కాదు. ప్రస్తుతం సైన్యాన్ని తగ్గించుకోవడం గురించి సంప్రదింపులు జరుగుతున్నాయి. రష్యా తనసైన్యాన్ని ఇంత తగ్గించుకోవాలి, అమెరికా తనసైన్యాన్ని ఇంత తగ్గించుకోవాలి అని సూచనలు చేస్తున్నారు. తగ్గించుకుని సైన్యాన్ని 20 లక్షలకు పరిమితం చేసుకోవాలి, అని అంటే పెంచుకుంటే ఎంత చేసుకోవాలో మరి ! విచిత్రమైన లెక్కలు కడుతున్నారు. ఇరుపక్షాల మధ్య ప్రేమ సంబంధాలు ఏర్పడిన తర్వాతకూడా 20 లక్షల సైన్యం ఉండగలుగుతుంది! మనపూర్వీకులు కనుక ఈఅంకెలు వినిఉంటే శాంతి ఏర్పరచుటకు కూడా 20 లక్షల సైన్యం కావాలా అని ఆశ్చర్యపోయేవారు. అలాంటప్పుడు 35 కోట్ల జనాభా గల ఇంత పెద్ద దేశంలోశాంతి స్థాపన కొరకు 70వేల శాంతిసేన కావాలని ఎవరైనాకోరితే అదిఎక్కువ అని అనవీలులేదు. ఇంత కొద్దిసంఖ్యతో

పని జరుగదు అని మాత్రమే ఆక్షేపిస్తారు. ఇంకా ఎక్కువ కావాలని అంటారు. అయితే నేను కనీసం లెక్క కట్టాను.

ప్రస్తుతం మన తలలపై రాజకీయాలనే పెద్దబరువు ఉంది. ఆంగ్లేయుల బరువైతే తొలగి పోయింది; కాని వారు మన నెత్తినరుద్దిన రాజకీయాల బరువు మాత్రం దిగలేదు. నేను చెప్పదలచుకున్నదల్లా ఆయుధాలతో సుసజ్జితులైన సైనికులు కూడా పార్టీలకు అతీతులుగా ఉండాలని భావింపబడుతుందని. సైన్యంలో పార్టీలు ఏర్పడటం మొదలు పెడితే 10 లక్షల భారతదేశ సైన్యంలో కొందరు పి. యస్. పీ వారూ, కొందరు కాంగ్రెసు వారూ, కొందరు కమ్యూనిస్టులూ అవుతారు. ఇలా కనుక జరిగితే మీ ఈ సేన ఇక పనిచేయలేదు. సైనిక పరిభాషలో కూడ సిపాయి అందరి సేవాచేయాలని అంగీకరించబడింది. అందు చేత లోకసేవకుని ప్రతిజ్ఞలో సేవకుడు అన్ని పార్టీల నుండి విముక్తుడై దూరంగాఉండాలని ఉన్న నియమం శాంతిసైనికునకు చాల అవసరం. అశాంతికి గల కారణాలలో పార్టీ భేదాలు కూడ ఒక కారణం కావచ్చును.

మన శాంతిసైనికుడు కులములతో సంబంధం లేకుండా కులతత్వానికి అతీతంగా ఉండి అన్నిమతములను సమభావంతో చూసేవాడై యుండాలని మనం అపేక్షిస్తాము. ఎందుచేతనంటే అతనలా ఉండకపోతే అశాంతి బీజాలు అతనిలోనే ఉంటాయి.

మిగిలిన విషయాలలో శాంతిసేనకు ఇతర సేనలకు సంబంధం లేదు. కాని క్రమశిక్షణ విషయంలో మాత్రం శాంతిసేన ఇతర

సేనలకు ఏమాత్రం తీసిపోదు సరిగదా మరింత ఎక్కువ కఠినంగానే ఉంటుంది. ఎందుచేతనంటే ఇందులో ఇతరుల ప్రాణం తీసేందుకు అవకాశంలేదు. తన వద్ద ఆయుధాలు ఉన్నప్పటికీ ప్రాణం బలిపెట్టే అవకాశం వస్తోంది. అందుకే దానిలో శౌర్యముంది, కనుకనే దానికి గౌరవమూ ఉంది. ఆయుధాలకు పూర్వం నుంచీ గౌరవం ఉందీ అంటే అందులో ప్రాణం బలిపెట్టగల అవకాశంకూడా ఉండడమే కారణం. ఈ మాత్రమైనా శౌర్యంతోకూడిన భాగం అందులోఉంది కనుకనే దానికి గౌరవండుంది. అయితే దానితోపాటు ఇతరుల ప్రాణం తీసేందుకు అవకాశం, సంసిద్ధత, అర్హత, వ్యూహం కూడా ఉంటాయి. కాని మన శాంతిసేనలో కేవలం ప్రాణం ఇచ్చేందుకు మాత్రమే అవకాశం ఉంది. అంతేకాదు, ఎదటివారి ప్రాణాన్ని రక్షించాలి. ఎవరైనా శాంతి సైనికుని నరుకుటకు కత్తి ఎత్తితే, ఆ దెబ్బనుండి తన మెడను తప్పించుకొను ఆలోచన అతని మనస్సులోనికి రానేరాకూడదు సరిగదా, కొట్టబోయేవ్యక్తి చేతికి దెబ్బ తగలకుండా చూడాలి. ఇలాంటి సందర్భాల్లో క్రమ శిక్షణ లేకపోతే పనిసాగదు. కమాండరు ఆజ్ఞపాలించే అలవాటు సేవకులకు అలవడాలి. 'ఆగు' అని ఆదేశింపబడగానే, మరుఆలోచన లేకుండానే వెంటనే ఆగిపోవాలి. ఈ విధంగా అలవాటు పడినప్పుడే ఏపనైనా జరిగేది.

శాంతిసేన సేవాసైన్యంగా ఉంటుంది. శాంతి-సేన అనేశబ్దం పాత శబ్దం. అది గాంధీజీ వాడిన శబ్దం. గాంధీజీ

మనకు ప్రసాదించిన పది-పదిహేను పదాలలో ఇది ఒకటి. అయితే ఈ శబ్దం ఆరోజుల్లో కొన్ని ప్రత్యేకమైన పరిస్థితులలో బయటకు రావడంచేత ఈ శబ్దానికి గల పూర్తి అర్థం తెలియ రాలేదు. అయితే గాంధీజీ కూడా శాంతిసేన ఎప్పటికీ సేవా సైన్యంగానే ఉండాలని అనుకునేవారు. అయితే ఎక్కడెక్కడ అశాంతి ఏర్పడుతుందో అక్కడికల్లా మనం వెళ్లి మన ప్రాణా లను అర్పించాలి అనే భావంలోంచి ఈ ఆలోచన వచ్చింది. కాని శాంతిసైనికుడు ఆవిధంగా తయారుకాడు. మాతృ సమానంగా అందరికీ సేవ చేయగలవాడే శాంతిసైనికుడు కాగలుగుతాడు. 'మాతృసమానంగా' అనే పదాన్ని నేను చాల ఆలోచించే ప్రయోగించాను. ఎందుకంటే సోదరుడు సోదరుని రక్షించిన సందర్భాలూ, మిత్రుడు మిత్రుని రక్షించిన సందర్భాలూ, సేవకుడు యజమానిని రక్షించిన సందర్భాలూ చాల కనబడతాయి. కాని, కష్ట సమయాలలో తల్లి పిల్లలను రక్షించుకునే దృశ్యం మాత్రం అద్భుతమైనది. ఈ ఉదాహ రణను కేవలం మానవులలోనే కాక ఇతర ప్రాణులలో కూడా చూడగలుగుతాము. పులి పిల్లను ఏ వేటగాడయినా పట్టు కుంటే, ఎదటతుపాకి-మృత్యువు-ఉందని తెలిసీకూడా ఆ పులి ఎలాదాడిచేసి పోరుసలుపుతుందో మనం చూస్తున్నాం. పులి పిల్ల పట్టుబడినప్పుడు మొగపులి పారిపోయినా, ఆడపులి మాటి మాటికి మాటువద్దకువచ్చి దాడిచేసే సందర్భాలు ఎన్నో ఉన్నా యని వేటగాళ్లు చెబుతారు. ఆ పులి తుపాకి చూచి వెనక్కు

తగ్గుతుంది; కాని పోదు. మరల వస్తుంది, విరుచుకుపడు తుంది. తుపాకికి ఆహుతి అయి, బిడ్డకొరకు తాను చెయ్య వలసినదంతా చేశాను అని అనుకున్నప్పుడే దానికి తృప్తి ఉంటుంది. శాంతిసేన యొక్క తత్వం ఇదే. తన బిడ్డను పట్టు కున్నవారిని చీల్చి తినాలని ఆ పులి అనుకుంటుంది. అదేమో సర్వోదయ తత్వాన్ని అంగీకరించింది కాదుగదా. తన బిడ్డను రక్షించుకోవడమనే భావమే దానిమనస్సులో ఉంటుంది. అది చంపడానికీ సిద్ధంగాఉంది, చావడానికీ సిద్ధంగాఉంది. తాను చనిపోయేవరకూ అది అలా ప్రయత్నిస్తూనే ఉంటుంది; చని పోయిన తర్వాతనే దాని ప్రయత్నం ఆగేది. అందుకే నేను తల్లి తన బిడ్డను ఎలారక్షించుకుంటుందో అలా శాంతిసైనికుని సేవ ఉండాలన్నాను. ఆ తల్లికి ఎదటివ్యక్తి అంటే భయంలేదు. మన సమాజంలో ఎక్కడ ప్రమాదం ఏర్పడినప్పటికీ – తల్లి తన బిడ్డను రక్షించుకొనుటకు పరుగు పరుగున వెళ్లినట్లుగానే, అందు తనను తాను రక్షించుకొనుట గురించి ఆలోచించనట్లుగానే— శాంతిసైనికులు పరుగు పరుగున అక్కడికి వెళ్లాలి. శాంతి సైనికులుగా చేరు సేవకులకు సహజంగానే అట్టి ప్రవృత్తి అల వడాలి. తల్లివలె పనిచేసినప్పుడే తల్లి ఉదాహరణ వర్తిస్తుంది. లేకపోతే కాదు. కనుకనే శాంతిసైనికుడు ముఖ్యంగా సేవా సైనికుడౌతాడు. *శాంతిసేన సేవాసేన అవుతుంది.* నిరంతరం వాత్సల్యభావంతో సేవచేస్తూ ఉంటుంది. మనకీ ప్రజలకీ మధ్య స్నేహసంబంధాలు ఏర్పడినప్పుడు, ఏదైనాక్లిష్టపరిస్థితివస్తేవ్యక్తికి

తన ప్రాణం విలువ తెలిసేతెలీదు. సహజంగానే త్యాగం చేయడం జరుగుతుంది. ఆ సమయంతో ఆ వ్యక్తి దానిని త్యాగం అనుకోడు, అది ప్రేమ కార్యమని భావిస్తాడు. అందుకే శాంతిసేవ ఎప్పటికీ సేవాసైన్యంగానే ఉంటుంది.

## సమ్మతి దానం

శాంతిసేనకు భౌతిక ఆధారములుగాని, ఆధ్యాత్మిక ఆధారములు గాని ఏవి అని నేను కొంత ఆలోచించాను. ఆ విషయాలు మీముందుంచుతాను. మన ప్రభుత్వం సైన్యాన్ని ఏర్పరుస్తోంది. దానికి ఆధ్యాత్మిక ఆధారం ఏమిటి? దాని భౌతిక ఆధారం ఏమిటి? మన ప్రభుత్వం గాని, లేక మరే ప్రభుత్వమైనా గాని ఏర్పరచే సైన్యానికి ఆధ్యాత్మిక ఆధారం అది ప్రజలనుండి తీసుకుంటున్నవోటు. లేకపోతే ఆ సేనకూ, దోపిడీగాండ్ర ముఠాకూ తేడాలేదు. ఆ సైన్యమునకు ప్రజల వోటు అండగాఉంది; అందుచేత ఆ సైన్యం దేశరక్షకురాలుగా అమోదింప బడుతోంది. ఈ విధంగా ఈ ఆధ్యాత్మిక ఆధారం ఆ సైన్యం వెనుక ఉంది. అలాగే మనకూ ఏదో ఒక ఆధ్యాత్మిక ఆధారం ఉండాలి. మనము కరుణా ప్రేరితులము, సేవచేయాలనుకుంటున్నాము. ఇంతకుమించి వేరే ఆధ్యాత్మిక ఆధారములను మనము అంగీకరించము. ఇదివరకు అక్కడక్కడ ఖాదీపని, గ్రామ పరిశ్రమల కార్యక్రమము - ఇలాంటివే రకరకాల నిర్మాణ కార్యక్రమాలను మనము ప్రారంభిం

చాము. అయితే వాటికి ప్రజల అంగీకారాన్ని మనం ముందుగా కోరలేదు. సేవచేయాలనే కోరిక గల వారికీ, హృదయంలో అట్టి కరుణ గలవారికీ ప్రజలలోనికి ప్రవేశించి సేవ చేసే అధికారం ఉంది. ప్రజలు అతనిమాట వింటున్నారాలేదా అనేవిషయమై అతను ఫిర్యాదు కూడ చేయడు. ప్రజలు ఆ మాట వింటే సరేసరి. వినకపోతే వినకపోయే అధికారం వారికుంది. మనం ఎన్నో గ్రామాల్లో ప్రవేశించాము. సంవత్సరాల తరబడి పనిచేశాము. కొన్నిచోట్ల నూటికి 25 మంది ఖాదీ కడితే కొన్నిచోట్ల నూటికి 30 మంది, మరికొన్నిచోట్ల నూటికి 35 మంది కట్టారు. అంతటితో అది ఆగిపోయింది. జరిగినంత వరకూ మంచి జరిగిందని మనం అనుకున్నాం. మనం చెప్పిన మాట కొందరు వినలేదు. వారికి వినకుండా ఉండే అధికారం ఉంది. కొందరు విన్నారు. వారికి విషయం నచ్చింది; అందుచేత విన్నారు. ఈ విధంగా సేవచేసే అధికారం అందరికీ ఉంది. కాని శాంతి సైనికుడై అందరిసేవా చేయాలని అనుకున్నప్పుడు అందరి అంగీకారం, సమ్మతిలేకుండా చేయాలంటే ఆ పనికి సత్తువరాదు. ఏకగ్రీవంగా వోటుకావాలని నేననడం లేదు. అయితే ఏ సమాజంలో సేవ చేయాలనుకుంటున్నామో ఆ సాధారణ ప్రజానీకం యొక్క అనుమతిని మన మింతవరకూ తీసుకోలేదు.

నిర్మలమైన విశుద్ధ సంకల్పం విశ్వసంకల్పం అవుతుంది. ప్రజలలోనికి వెళ్ళి శాంతి స్థాపించాలనేది మన ఆకాంక్ష.

ముందు మనం బలి అయిపోతే, ఆ తర్వాత అశాంతి ఉన్నా మనకు చింత అనవసరం. అది చరమదశ అనుకోండి. కనీసం మన కర్తవ్యం పూర్తి అవుతుంది గదా. అయితే మనం బ్రతికి ఉండగానే శాంతి ఏర్పడగల విధంగా ప్రజలపై మన ప్రభావం పడాలని ఆశిస్తాము. అందుచేత కేవలం సేవచేసే అధికారమే కాక ప్రజల హృదయాలను నైతికంగా ప్రభావితం చేయగల అధికారం కూడ ఉండాలని మనం అనుకుంటున్నప్పుడు, అందుకుగాను ప్రజల తరఫునుండి ఏదో ఒక అంగీకారం కావాలిగదా. దానికి నేను సమ్మతిదానం అని పేరు పెట్టాను. సమ్మతిదానం అంటే, మీ సేవను మేము అంగీకరిస్తున్నాము అందుకుగాను మేమూ ఏదో కొంత చేస్తాము అని తెలపడం అయితే మిమ్మల్ని రక్షించే అధికారం మీరు మాకివ్వండి అ., అంగీకారం మేము కోరడం లేదు. ఎందుకంటే అప్పుడు మనమూ ఒకరకమైన క్షత్రియులమై పోతాము. ఆయుధాల నుపయోగించని క్షత్రియులమని కాదు; మేము రక్షించే వాళ్ళము - ఇతరులు రక్షింపబడే వారు అనే భావం వచ్చిందంటే ఆ భూమికపై మనం వేరే వర్ణమై పోతాము; ఈ అర్థనలోనే మనం క్షత్రియుల మౌతామని నేనసేది. ఆ రకమైం రక్షించే అధికారం ఇమ్మని మిమ్ము మేము ఓటు అడగడంలేదు. మేము చేసే పని మీకు నచ్చిందా, లేదా, నచ్చితే దీనికై మీ రేమి సహాయం చేస్తారో తెల్పండి అను అర్థంలోనే మిమ్ము సమ్మతిదానం అడుగుతున్నాము. శాంతి సైనికుడు ఏ సమా

జానికి సేవ చేయబూనుతాడో ఆ యా కుటుంబాలనుండి ప్రతి నెలా ఏదో కొంత సమ్మతిదానంగా అతనికి లభిస్తూ ఉండాలి.

ఈ విధంగా మొత్తం భారతదేశం అంతటా మనం వ్యాపించాలి. ప్రతి గ్రామంలో మనం విస్తరించాలంటే ప్రతీ గ్రామంలో గ్రామరాజ్యం ఏర్పడిందని భావించుకునే, మనం ముందుకు సాగాలి. ప్రస్తుతం అమలు జరుగుచున్న గ్రామ దానం, గ్రామ నిర్మాణ కార్యక్రమాలు కూడా మామూలుగా కొనసాగుతూనే ఉంటాయి. అయితే గ్రామరక్షణకొరకు ఈ శాంతిసేన అత్యవసరం. ఏ కార్యక్షేత్రంలో మనం పనిచేస్తామో ఆ కార్యక్షేత్రంలోనే సమ్మతిదానం కావాలని కోరుతాము.

దేశంలో శాంతి ఎలా రాగలుగుతుంది? అని మధనపడు తున్న వారందరు నూతన దృక్పథంతో ఆలోచించాలి. అందుకే ఈ విషయాలన్నీ మీ ముందు ఉంచుతున్నాను. మనం ఈ విష యంలో ఏమి చెయ్యాలి అని అనుకున్నప్పుడు మన నిర్మాణ కార్యసంస్థలు ఎన్నైతేఉన్నాయో అవన్నీ ఈ కార్యక్రమంలో నిమగ్నం కావాలి అనిపిస్తోంది. ఖాదీ కార్యక్రమంలో ఉన్నా, అస్పృశ్యతా నిర్మూలన కార్యక్రమంలో ఉన్నా, 'నయీ తాలీం' (బేసిక్ విద్య) కార్యక్రమంలో ఉన్నా- ఎందులో ఉన్నా- ఈ కార్యమందు ఆ సంస్థలన్నీ ఆత్మసమర్పణ కావాలి. శాంతిసేన లేకుండా అహింసాయుత విప్లవం సంభవం కాజాల దని మనం భావిస్తున్నాము గనుక, శాంతిసేన మన కార్య క్రమంలోనే వచ్చి తీరుతుంది.

## భావ స్వాతంత్ర్యం - ఆచార నియమాలు

చివరకు, సామాజిక జీవితానికి పునాది ఏమిటి ? భావ స్వాతంత్ర్యం, ఆచార నియమాలు సాంఘిక జీవితానికి పునాదులు. ఇందుకు ఉత్కృష్టమైన ఉదాహరణ మన భారతీయ ధర్మము. హిందూ ధర్మములో ఆరారు దర్శనాలున్నాయి. ఒకదాని కొకటి పూర్తి వ్యతిరేకమైనవి. సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, పూర్వ మీమాంస, ఉత్తర మీమాంస, బౌద్ధ - జైన దర్శనాలు. ఇంకా ఎన్నో దర్శనాలున్నాయి. అయితే వాటి పేర్లుకూడా మన కీ రోజున తెలియడం లేదు. బుద్ధునికాలంలో సుమారు 50 మంది తాత్వికుల తత్వశాస్త్రాలు వేర్వేరుగా ప్రచారంలో ఉండేవని గ్రంథాలబట్టి తెలుస్తోంది. ఈ భూమియే వేదాంత భూమి. తత్వశాస్త్రాలకు పుట్టిల్లు. అయితే దానితో పాటు ఆచార నియమాలు లేకపోతే ధర్మమనేదే ఏర్పడదు. అందుచేత సర్వోదయంలో భావస్వాతంత్ర్యం అనే విషయంతో పాటు, శాంతి సైనికులకు శాంతిసేన సేనాపతి ఆజ్ఞను పాలించాలనే విషయం మీ ముందు పెడుతున్నానంటే పరస్పర వైరుధ్యం ఏమీ లేదు. ఈ విషయమై సంస్కృతంలో నేను ఒక మంత్రం సూత్రీకరించాను. సామ్యసూత్రాలలో ఇది చేర్చబడింది. "సంయతేన స్వైరమ్", భావంలో, ఆలోచనలో మీరు స్వేచ్ఛను అనుభవించాలనుకుంటే ఆచరణలో నియమబద్ధులు కావాలి. ఇందుకు నేను సాధారణంగా ఒక ఉదాహరణ ఇస్తూవుంటాను. రోజూ వెళ్ళే దారి నిశ్చయమైనదైతే మనిషి కళ్లు మూసుకుని

వెళ్ళగలడు. చక్కగా స్వేచ్ఛగా ఆలోచనలో మునిగిపోగలడు. దారి నిశ్చితము. కనుక దారి గురించి ఆలోచించ నక్కరలేదు. దారి నిశ్చయమైనప్పుడు మనిషి ఆచరణలో నియమబద్ధుడౌతాడు. అప్పుడు ఆలోచనకు పూర్తి స్వతంత్రం ఉంటుంది. అందుచేత మనం ఆలోచనా స్వాతంత్ర్యం కావాలని కోరుకుంటే దానితోపాటు ఆచారనియమాలు వస్తాయి.

---

# అహింసయొక్క సమీకరణశక్తి
# శాంతి సేన

వి నో బా

సేన అనే శబ్దాన్ని ఉపయోగిస్తున్నామంటే సేవద్వారా ఆక్రమణ జరగాలని అర్థం. విశ్వవిద్యాలయాలలో ఎంతోమంది జ్ఞానులున్నారు. వారు విచిత్రమైన ఆవులవంటివారు. పొదుగు నిండా పాలు ఉన్నప్పటికీ ఈ ఆవులు దూడలకు స్వయంగా పాలివ్వవు. దూడలు తమ వద్దకు వస్తేనే పాలిస్తాయి. కాని శంకరుడు, రామానుజుడు వాత్సల్య ప్రేరితులై ఇంటింటికీ తిరిగి జ్ఞానబోధ చేశారు. వారి జ్ఞానం ప్రేరణదాయకమైనది. నేటి ప్రొఫెసర్లు ఆ విధంగా జ్ఞానంతో దాడి జరపడంలేదు. ఇందుకు కారణం వారిలో అట్టి వాత్సల్యం లేకపోవడమే. సేవ కూడా దాడి జరపాలి. ఎవరో బాధపడుతున్నవారు మన వద్దకు వచ్చి చెయ్యి జాపినప్పుడు ఏదో కొంత ఇచ్చి పంపివేస్తే సరిపోతుందా? మన పిల్లలు చెయ్యి జాపితేనేనా మనం వారికి సహాయం చేస్తున్నది. అందుచేత పిల్లలకు సహాయం చేసినట్లే వారికీ చెయ్యాలి. ఇంటింటికీ వెళ్ళి ప్రజల బాధలేవో తెలుసుకుని వారికి సహాయం చేయాలి. అట్టి సేవాసైన్యమే అవసరమొచ్చినప్పుడు శాంతి సైన్యం అవుతుంది. ఇట్టి సైన్యం ఏర్పడి ఉన్న చోట అసలు అశాంతికి కారణాలు తగ్గిపోతాయి. దానివల్ల ప్రమాదావకాశాలు అరుదైపోతాయి. అయినా ఎప్పుడైనా

నిప్పు రాజుకోవడం అసంభవం కాదుగదా! ప్రస్తుతం దేశంలో నిప్పు రాజుకొనగల అవకాశాలు చాలా ఉన్నాయి. పార్టీ భేదాలు, జాతి మత కుల భేదాలు, అసమానతలు ఇలావుండగా సాంఘికస్థితి మారనప్పుడు ఎప్పుడైనా, ఎక్కడైనా అశాంతి పుట్టవచ్చును. అలాంటి సమయాలలో ప్రజలకు సేవ చేసినవారు శాంతి సైనికులు కాగలరు. సమయోచితంగా వారు చేయగల బలిదానంతో శాంతి ఏర్పడగలుగుతుంది.

నిరంతర సేవ జరుగుతూ ఉండగల ఏర్పాటొకటి భారత దేశమంతటికీ ఉండాలి. అప్పుడే గ్రామదాన విప్లవం స్థిరంగానూ, శాశ్వతంగానూ నిలువగలదు. గ్రామదానం ద్వారా ఏర్పడ్డ నైతిక వాతావరణ ప్రభావం చక్కగా ఉండగలుగుతుంది. అంతేకాదు- ఆ ప్రభావం అంతకంతకు పెరుగుతూ ఉంటుంది. అందుకుగాను మొత్తం భారతదేశంలో 70 వేల మంది సైనికులతో సేన ఒకటి సిద్ధం కావాలి.

'సేవాసేన' అనే పదాన్ని ఎందుకు ప్రయోగించాను? భారతదేశంలో సేన అయితే ఉంది. కాని సేవా సైన్యం లేదు. అంటే సేవ దాడి జరపడం లేదు. ఈ విధమైన సేవ సాంఘిక విప్లవం కాజాలదు. కనుక సేవ దాడి జరిపి తీరాలి.

తల్లి ప్రేమాక్రమణం జరుపుతుంది, అలాగే సేవా క్రమణంకూడా కావాలి. సేవాసైన్యంలోని సేవకులు స్వయంగా ఇంటింటికీ వెళతారు. ఈ సేవాసైన్యమే అవసరం వచ్చినప్పుడు శాంతి సైన్యం అవుతుంది.

మనం శాసనముక్త సమాజాన్ని మనధ్యేయంగా పెట్టుకున్నాము, శాసనముక్త సమాజం ఏర్పడ్డప్పుడు, ఆ సమాజం శాంతిసేవ విముక్తంకూడ అవుతుంది. అందు సేవచేసేవారు ఉంటారు. ప్రతీ ఇంటినుండి కొందరు చేరి, ఆ గ్రామంలో ఎవరివల్లనైనా ఏదైనా తప్పు జరిగితే దాని బాధ్యతను వారంతరూ తీసుకుని ఫలితాన్ని అనుభవించుటకు సిద్ధంగా ఉంటారు. తండ్రి ఏదైనా తప్పుచేస్తే దాని బాధ్యతను తీసుకొనుటకు కొడుకు సిద్ధంగా ఉంటాడు. తండ్రి కొడుకుని సర్దుకుంటే కొడుకు తండ్రిని సర్దుకుంటాడు. అలాగే ఇరుగు పొరుగు వారు ఒకరి నొకరు సర్దుకుంటారు. ఒక గ్రామాన్ని మరొక గ్రామమూ అలాగే సర్దుకుంటుంది. ఈ విధంగా చివరి దశలో ఎక్కడి కక్కడ విషయాలు సర్దుకుంటే శాంతిని ఏర్పరచుటకని దూరంగా మరెక్కడినుంచో ఎవరూ రావలసిన అవసరం ఉండదు. అట్టి చివరి స్థితిని మనము తేవాలను కుంటున్నాము. అప్పుడు మనది ఒక ప్రత్యేకమైన త్రోవ అవుతుంది. అయితే ఒక విషయం మనం గుర్తించాలి. హింసాయుత శక్తులు ఎంతో నష్టాన్ని కలిగిస్తున్నాయని స్పష్టంగా తెలిసినా కూడా అవి ఇంకా సంరక్షణకుగాను ఎందుకు అంగీకరింపబడిఉన్నాయి? నేటి స్థితిలో సమస్యలను పరిష్కరించగల శక్తి ఏమైనా హింసాశక్తిలో ఉందా అని మనం ఎవరిని అడిగినా, లేదు అనే అంటారు. అయినా, రక్షణ ప్రసక్తి వచ్చినప్పుడు మాత్రం

హింసాదేవినే ఆరాధించి ఆమెనే ఆధారం చేసుకుంటారు. దీనికి కారణం ఏమిటి? ఈ విషయాన్ని మనం ఆలోచించాలి.

ఎవరికి వారు దళాలుగా ఏర్పడి దెబ్బలు సహించుటకు నిలబడాలని అంటున్నాం. అహింస 'కమాండ్'లో స్వయంగా ఆత్మార్పణం చేసుకునే ఆజ్ఞకంటె వేరుగా మరొక ఆజ్ఞ ఉండదు.

హింసయొక్క రక్షణశక్తి ఎందులో ఉంది అనేది మన ముందున్న ప్రశ్న. ఏదేనా ఒక విషయంలో ప్రమాదం వచ్చిందంటె వెంటనే పది మందినో-పదిహేను మందినో, పది పదిహేనువేల మందినో ఒక దళంగా సిద్ధపరచగల శక్తి హింసకు ఉన్నది. అదే హింసలో ఉన్న రక్షణ శక్తి. అహింసలో కూడా అట్టిశక్తి వచ్చినప్పుడుఏమౌతుంది? ఆజ్ఞ ఇస్తే బలిదానానికి సిద్ధపడడం జరగగలుగుతుందా అనేది ప్రశ్న, జరగగలుగు తుంది అనే అనుకుందాం, అంటే మానవుడు ఆ ఆజ్ఞముందు తన ప్రాణాన్ని తుచ్ఛంగా ఎంచుకుని బలిదానానికి సిద్ధపడు తున్నాడన్నమాట. అట్టి బలిదానంలో, బలిదానం చేసేవ్యక్తి హృదయం ప్రేమతో నిండి ఉంటుందా? మేము అపేక్షిస్తున్నది మామూలు ప్రేమను కాదుగదా, మాతృవాత్సల్యాన్ని. సోద రుడు సోదరుని రక్షించవచ్చు; మిత్రుడు మిత్రుని రక్షించవచ్చు కాని మేము అపేక్షిస్తున్నది మాతృప్రేమను.

తన శక్తినంతనూ ఒక్కచోట సమీకరించగల అవకాశం హింసలో ఉంది. ఆ అవకాశం అహింసలో లేకపోతే

ఆ అహింస పని చేయదు. చివరి దశలో ఇలా కొన్ని లక్షల మందిని సమీకరించ వలసిన అవసరం రాక పోవచ్చు గాక. కాని, ఇప్పుడు సమస్యలు మనముందు ఉన్నప్పుడు హింసావాదులు వేలు, లక్షల కొద్దీ జనాన్ని సమీకరించి చూపుతున్నప్పుడు, మనం ఆ విధంగా లక్షల కొద్దీ జనాన్ని సమీకరించ లేకపోతే అహింస రక్షణకారి కాలేదు; కేవలం జీవితంలో కొంచెం మాధుర్యం తేగల శక్తిగా మాత్రమే మిగిలి పోతుంది.

నేటి భారతదేశ పరిస్థితి శాంతి కావాలని డిమాండు చేస్తోంది. దానినుండే శాంతి—సేన బయలుదేరుతోంది. ఆ డిమాండు పూర్తిఅయి, శాంతిని ప్రత్యేకంగా ఏర్పరచ వలసిన అవసరం ఉండకపోతే శాంతి సైన్యం సేవాసైన్యం అవుతుంది. ఆపైన ప్రత్యేకంగా సేవచేయవలసిన అవసరం కూడా రాక పోవచ్చు. ఎవరికి వారు అందరూ తమ తమ పనులు చేసుకుంటే సేవ చేయవలసిన అవసరం కూడ రాదు. సమానత్వంతో విలసిల్లే సమాజం, సర్వోదయ సమాజం ఏర్పడుతుంది. నెమ్మది, నెమ్మదిగా సామ్యాలు పెరుగుతూ, సమత్వం అభివృద్ధి చెందుతూ వివిధ భేదాలు సమసి పోతాయి. అట్టి అంతిమ స్థితిలో రైతే తత్వజ్ఞానీ అవుతాడు, శాంతి సైనికుడూ అవుతాడు. అతనే సత్యాగ్రహికూడా అవుతాడు. ఈ విధంగా రైతు పరిపూర్ణుడౌతాడు. కాని నేటి స్థితి అలాలేదు. మనం అహింసను కనుక భారతదేశంలో స్థాపించక పోతే, అహింస వాతావారణాన్ని పెంపొందించి, స్థితిని అహింస వశంలోనికి తెస్తేనేగాని మన

ఈగ్రామదానం, గ్రామరాజ్యం ప్రమాదస్థితినుండి బయటు పడవు. ఏదో కొంత మంది మాత్రం పనిచేసి, కొంతమాధుర్యాన్ని సృష్టించడం మాత్రమే జరిగితే పనికాదు; క్షీర సాగరంలో మధు బిందువులు వేసి మాధుర్యాన్ని తీసుకు వచ్చుటకు ప్రయత్నించడంవలె ఉంటుందది. అట్టి ప్రయత్నం కేవలం ఒక ప్రయత్నం మాత్రమే. అహింస ఆధిపత్యాన్ని మనం నిర్మించాలి. సత్త్వగుణపు బద్దీలు కావాలి. వానిపై రజోగుణపు ఇంజను ఎంతవేగముగానైనా పోవచ్చు. ఆపైన ఆ ఇంజనుకు తమో గుణపు పెట్టెలను తగిలించవచ్చు. రజో గుణం తమోగుణం కూడా కావాలనే మేమంటున్నాము. అయితే బద్దీలు మాత్రం సత్త్వగుణానికి చెందినవి కావాలి. నేడుకొద్ది మంది అహింస గురించి పనిజేస్తే అదిచాలదు. ఆలశ్యమైనప్పటికీ ప్రతి ఒక్కరి హృదయంలో అహింస ప్రవేశించునట్లుగా పని చేయాలి. కనుక శాంతి సైన్యం కార్యక్రమం ఎప్పుడో చేయ వలసిన కార్యక్రమం కాదు. బొంబాయి కార్యకర్తలతో మాట్లాడుతూ అచట కనీసం వెయ్యిమంది సేవకులైనా సమీకరింప బడాలని చెప్పాను. అప్పుడే బొంబాయి నగరంపై అహింస ప్రభావం పడ గలుగుతుంది. ఇతరత్రా వేర్వేరు సమస్యల పరిష్కారానికై సాగుచున్న వేర్వేరు ఉద్యమాలుకూడా కొనసాగుతూనే ఉంటాయి. వాటివల్ల సమాజానికి లాభమేగాని నష్టంలేదు.

సత్యాగ్రహి లోకసేవకుల కర్తవ్యాలన్నిటిలోనికీ ముఖ్య కర్తవ్యమైన శాంతిసేన విషయమై అందరి దృష్టినీ ఆక

ర్ధించాలనుకుంటున్నాను. పుస్తకంలో అనేక ప్రకరణాలుంటాయి. అయితే ప్రస్తుతం అవసరమైన ఒక ప్రకరణం గురించి మీరు శ్రద్ధ వహించాలని చెప్పదలచుకున్నాను. నేడు సత్యాగ్రహ లోకసేవకులు చాల కొద్దిమందే ఉన్నారు. అందుచేత వెంటనే వారి దృష్టికి ఈ విషయం తేవాలనుకుంటున్నాను. నేటి సమాజంలో కొనసాగుతున్న అయోమయస్థితి మధ్యకి వెళ్ళి నిలుచోన వలసిన బాధ్యత మనది.

ఏదేనా ప్లాను వేసేటప్పుడు పూర్తి శాస్త్రీయంగానే వేయవలసి వస్తుంది. అందుచేతనే అవసరం వచ్చినప్పుడు ఆదేశం ఇవ్వగానే శాంతిసైనికుడు తన ఇష్టాయిష్టాలను ఒక ప్రక్కన పెట్టి నిర్దేశించిన స్థలానికి వెంటనే వెళ్ళాలి. ప్రత్యేక పరిస్థితులు ఏర్పడినప్పుడు మాత్రమే ఇలాంటి అవసరం కలుగుతుంది. మామూలు సమయాలలో శాంతిసైనికులు ఎవరి స్థలాలలో వారే పనిచేస్తూ ఉంటారు.

ప్రభుత్వం సగటుకు చెందిన ప్రభుత్వం అవుతుంది. అందుచేత అశాంతియొక్క మూలతత్వమును అది నిరసించ లేదు. ప్రభుత్వం ఆపనిని చేయలేదు. అలాంటప్పుడు ఆపనిని చేసేదెవరు? సత్యాహింసలను అంగీకరిస్తున్నామని చెప్పుకునే వారిపైనా, జనశక్తి–శాసనముక్తి తమధ్యేయమని భావించే వారిపైనా, గాంధీజీ నుండి వారసత్వంగా ఈ కర్తవ్యనిర్వహణ బాధ్యత తమకు లభించిందని అనుకునే వారిపైనా ఆపనిని చేసే భారం ఉంటుంది. శాంతి సైనికులుగా పేర్లు నమోదు చేసు

కున్నవారు నమోదుచేయబడిన సైనికులుగా ఉంటారు. పేర్లు నమోదు చేసుకోనక్కరలేకుండా కూడా లక్షలాది, కోట్లాది ప్రజలు సైనికులుగా ఇందు పాల్గొనవలసియుంది.

మీకు వేరే ఎవరో ఆజ్ఞలివ్వరు.

శాంతిని ఏర్పరచే విషయం ఆత్మశక్తిపై ఆధారపడి ఉంది. అందుచేత ఎంతగా ఆత్మశక్తి వికసిస్తే అంతగా పని జరుగుతుంది. సత్పురుషులను వర్ణించేటప్పుడు వారి ఆంతరంగిక గుణాలను వర్ణిస్తారు. ఆయన ఎవరినైనా కృపాకటాక్షంతో చూస్తేచాలు అంటారు. అలాగే కళ్ళల్లో కారుణ్యం నిండిన మనిషి అక్కడికి వెళితే, అట్టి వ్యక్తి అచ్చట కనబడడంతోనే శాంతి ఏర్పడుతుంది. అంతేగాని వేరేపద్ధతి ఏమీ ఉండదు.

సత్యాగ్రహ శక్తి వ్యాయామం చేస్తే పెరగదు. దానికి సేవ, కారుణ్యం, ఆత్మశుద్ధి, తపస్సు మొదలైనవి కావాలి. ఏ విషయాన్నైనా మన జీవితాచరణ ద్వారా ప్రజల ముందు పెడితే దాన్ని బట్టే ప్రజలు సత్యాగ్రహి ఎవరు అనేది తెలుసుకోగలుగుతారు, సత్యాగ్రహంలో సత్యమే ముఖ్యమైనది. సత్యాగ్రహం అంటే స్వీయ ఆగ్రహం లేకుండా ఉండడం. సత్యమే స్వయంగా పట్టుదల పట్టునట్లు చూడాలి. మధ్యలో మనం వెళ్ళరాదు. మధ్యలో మనం వెళితే అది సత్యం పేరుమీద మన ఆగ్రహం అవుతుంది గాని, సత్యాగ్రహం కాదు.

---

# భూదానంనుండి శాంతిసేన

## వినోబా

భూదానం ఆరంభమైనప్పుడు దానితోనే సంతృప్తి చెందాను. తరువాత 6 వ భాగం అడుగగా ప్రజానీకం వెంట వచ్చింది. చివరకు అది గ్రామదానంగా పరిణమించింది. ఇక భూమిపై వ్యక్తిగత యాజమాన్యాన్నే తీసివేయడం. ప్రజానీకం ఈవిషయాన్ని మన్నించింది. గ్రామానికి గ్రామం ఇలా 2,500 గ్రామదానాలు వచ్చాయి ఇప్పటికి. ఆ తర్వాత తమిళనాడులో గ్రామరాజ్య మనే విషయాన్ని చెప్పాను. ఇప్పుడు మీ ప్రాంతం (కేరళ)లో మరొకఅడుగు ముందుకు వేస్తున్నాను. ఇవన్నీ సర్వోదయంలోనే ఇమిడి ఉన్నాయనుకోండి.— ఒక్కొక్క విషయం యథార్థంలో ఎంతగా రూపం తీసుకుంటుందో చూచి ఆపైన మరొక విషయానికి వెళుతున్నాం. మేము ఆదర్శవాదులము; అయితేవ్యావహారిక ఆదర్శవాదులము. తమిళనాడులో గ్రామ రాజ్యం గురించి చెప్పినదానికంటే మరొక అడుగు ముందుకు వేసి సేవాసైన్యం, శాంతిసైన్యం గురించి మీకు చెప్పదలిచాను. సేవాసైనికుడే అవసరం వచ్చినప్పుడు శాంతిసైనికుడౌతాడు. నిరంతరం ప్రజాసేవలో నిమగ్నమై యుండి, అవసరం వస్తే శాంతిసాధనకుగాను ఆత్మబలిదానానికి సిద్ధంగా ఉంటాడు; ఈ విధంగా సేవాసైన్యం-శాంతిసైన్యం అని వస్తున్న ఆలోచనను ఊహగా వదిలివేయుటే కాక దానిని ఆచరణలో ప్రయోగించి చూద్దాము.

అందుకు కేరళ అనుకూలమైనది. ఇక్కడ వివిధ మతాలున్నాయి: వేర్వేరు పార్టీలున్నాయి. పార్టీలమధ్య సంఘర్షణ సాగుతోంది. అంతేకాక పురాతన కాలంనుంచీ ఈ ప్రాంతానికి ఇతర ప్రపంచముతో సంబంధము ఎక్కువ ఉంది. కనుక ప్రపంచ విషయాలు ఇక్కడ త్వరగా గుర్తింప బడుతున్నాయి. అలాగే ఇక్కడి విషయాలనూ ప్రపంచం గుర్తిస్తోంది. కనుక కేరళలో సేవాసైన్యం, శాంతిసైన్యం స్థాపింపబడితే, దాని ఫలితం ప్రపంచమంతటా పడగలదు. మనం ఇలా అంటున్నామంటే, విశ్వశాంతిగురించి చెబుతున్నామంటే చిన్న మనుష్యులం పెద్ద విషయాలు చెప్పడంకాదు. చిన్న త్రికోణంలో నిరూపింపబడిన విషయం పెద్ద త్రికోణంలోనూ నిరూపింపబడగలదు. అదేవిధంగా చిన్నప్రాంతంలోనైనాసరే ముఖ్యమైన పునాది విషయాలపై పని జరిగితే ప్రపంచమంతకూ అది వర్తించగలదు.

పునాది విషయం అంటే ఏది? ఏ ప్రదేశములోనైనా పునాది విషయమై పని జరుగుతోందనుకోండి. దానికిగాను అన్ని రకాల సహాయం బయటినుంచి వస్తుందనుకోండి: ఆర్థికసహాయం, పరికరాల సహాయం, నిపుణుల సహాయం-అంతా బయట నుంచి రాగా పని జరిగితే అది ప్రపంచానికి ఉదాహరణ కాజాలదు. మూల భూతంగా కార్యమును కొనసాగించాలంటే అది స్థానిక శక్తి ద్వారానే వికసించగలదు. అట్టి పునాది కార్యమే ప్రపంచానికి వర్తించగలుగుతుంది. ప్రతీవ్యక్తి స్వీయశక్తితో పని చేయగలుగుటయందే, ప్రతీ గ్రామంలోని ప్రజతమలో నిహితమై

యున్న శక్తి యుక్తులను గుర్తించి, వాటిద్వారా పనులు చేయుటయందే పునాది కార్య విధానం ఇమిడిఉంది. ఆ విధంగా కేరళ ప్రజానీకం స్వీయశక్తిని గుర్తించి, పెంపొందించుకొని సేవా సైన్యాన్ని, శాంతిసైన్యాన్ని నిర్మించాలని నా అభిలాష.

నేడు ప్రపంచంలోని దేశాలన్నిటిలోనూ ప్రభుత్వాధికార పాలన జరుగుతోంది. అవి ప్రజలచే ఎన్నుకోబడిన ప్రభుత్వాలు అయినంత మాత్రమున జనశక్తిచే నడపబడుచున్నవని అనుకోరాదు. అవి ప్రజా ప్రతినిధి ప్రభుత్వాలు. చేయవలసిన పనులన్నీ ప్రతినిధులకే అప్పజెప్పుట జరుగుతోంది. అయినా, భోజనంచేయుట, స్నానంచేయుట, నిద్రపోవుట మొదలగు అవసర విషయాలు ప్రతినిధులపై వదలిపెట్టక మనమే చేస్తున్నాము! వివాహానికి వరుడు రాకపోతే ప్రతినిధివల్ల వివాహం కాదుగదా. అంటే ముఖ్య విషయాలు మనమే చేసుకుని, ముఖ్యం కాని ఇతర విషయాలనే ప్రతినిధులపై వదిలిపెట్టుట జరుగుతోంది. మన ముఖ్యమైన విషయాలను ప్రతినిధులపై వదలిపెడితే మనం-శక్తిహీనులమై పోతాము. మన సౌకర్యంగా ఉండమని మనం శాసన సభ్యులను ఎన్నుకుంటున్నాము; కాని వారు యజమానులై, మనం-ప్రజానీకం - నామమాత్రపు యజమానులుగా మిగిలి పోతున్నాము. పూర్తిగా బానిసలవలె తయారవుతున్నాము. ఇది ప్రజాస్వామ్యమా ? నేడు అమెరికాకు చెందిన మొత్తం అధికార మంతా ఐసెన్ హోవర్, అతని కొద్దిమంది అనుచరులచేతుల్లోనేవుంది. వారి వివేకం ఏ మాత్రం తప్పుదాతి

పట్టినా లేక వారు కావాలనుకున్నా ప్రపంచమంతకూ నిప్పు ముట్టించగలరు. ప్రతినిధులకు ఇంత భయంకరంగా శక్తి నివ్వడం జరిగింది. మన మొత్తం జీవితంపై మనకే అధికారమూ లేదు. వివాహానికి శాసనము, చదువుకు శాసనము, భూమి శాసనము, వర్తకానికి శాసనము- ఈ విధంగా జీవితములోని ఏ రంగమూకూడ ప్రభుత్వ శాసనానికి దూరంగాలేదు. ఈ స్థితి ఏ ఒక్క దేశంలోనో కాదు; మొత్తం ప్రపంచమంతా ఇలాగే ఉంది. ఇది చాల భీకరమైన స్థితి. కనుక ముఖ్యమైన విషయాలు మనమే చూచుకొని అప్రధానమైన విషయాలు మాత్రమే ప్రతినిధులకు వదలిపెట్టాలి. ఇది గ్రామదానంలో జరుగగలుగుతుంది; ఇందుకే సేవాసైన్యాన్ని నెలకొల్పాలి. సర్వోదయ మండలిని ప్రతీగ్రామంలో స్థాపించాలి. సర్వోదయమండలి లోని సేవకులు అందరికీ సేవచేయువారై, పార్టీ విముక్తులై ఉండాలి. వారు అందర్నీ మార్చేవారుగా ఉండాలి. తమ వివేక బుద్ధిని ఎవరికీ అప్పగించరాదు.

కాని నేటి స్థితి ఏమిటి? 100 మంది ఓటర్లున్నారనుకోండి. అందు 60 మంది ఓటువేశారు. 40 మంది వేయలేదు. ఆ 60 లోనూ కూడా 30 ఒక పార్టీకి వచ్చాయి. మిగిలిన 30 ఇతరపార్టీలకు వచ్చాయి, అంటే 100 మందిపై 30 మంది అధికారం చలాయించడము జరుగుతుంది. ఏదేనా శాసనంచేయాలంటే ముందు 30 మంది పార్టీ మీటింగు జరుగుతుంది. అందులో 14 గురు వ్యతిరేకిస్తారనుకోండి. పార్టీ మీటంగులో వ్యతిరే

కించినా, అసెంబ్లీలో సమర్థిస్తారు. మిగిలిన 16 గురు కూడ తమ నాయకుడు గాని, ఒకరిద్దరు మంత్రులు గాని చెప్పినట్లు వింటారు. ఇలా ఒకరిద్దరు 100 మందిని పాలించుట జరుగుతోంది. ఈ విధంగా ఇదంతా 'బోగస్'. ఇందు జనశక్తి ఏమీ కనబడదు, ప్రజాభిప్రాయం తమకు అనుకూలమని వాదిస్తారు కనుక పూర్వకాలపు రాజులకంటే వీరు ఎక్కువ నష్టాన్ని చేయగలరు. అంతేకాక పూర్వపు రాజుల రాజ్యం 'వెల్ ఫేర్ స్టేట్' (శ్రేయోరాజ్యం) కాదు కనుక జీవితంలోని కొన్ని రంగాలైనా రాజుకు సంబంధం లేకుండా ప్రజల చేతుల్లో ఉండేవి. రాజు మంచివాడైతే పరిపాలన బాగుండేది; చెడ్డవాడైతే చెడుగా ఉండేది. నేడు జరుగుతోన్నదీ అదేగదా. అందుచేతనే బొంబాయిలో మద్యనిషేధం జరగగలిగింది గాని గోహత్య నిషేధం జరగలేదు. బీహారులో గోహత్యానిషేధం జరగగలిగింది గాని మద్యనిషేధం జరుగలేదు. దీనికంతకూ ప్రజాభిప్రాయమే కారణమంటారా ? పూర్వపు రాజు తన సర్దారులతో పని చేయించుకొన్నట్లు గానే నేడు ప్రధానమంత్రి మంత్రి వర్గమును ఏర్పరచుకుంటున్నారు. నేటి ఈ ప్రజాస్వామ్యం రాజరికానికి ప్రతిక్రియాత్మకంగా వచ్చింది మాత్రమే. కనుక పూర్వపు దోషాలు ఇందులోనూ వచ్చాయి. ఇలా అధికారము అంతా ప్రభుత్వం చేతుల్లో ఉండటం స్వరాజ్యమా ? ప్రజలు తమ స్వీయశక్తిని గుర్తించ లేనప్పుడు పూర్వపురాజరికానికీ, ఈ ప్రజాస్వామ్యానికీ తేడాఏమిటి ? పూర్వం బండను నా నెత్తిన ఇతరులు పెడితే, ఇప్పుడు ఆ బండను నేనేఎత్తిపెట్టుకునే అధికారం వచ్చింది. అంతే

గాని బండను మోయడం తప్పలేదు. ఈ విధముగా ప్రపంచంలో నేడు ఎక్కడా స్వాతంత్ర్యము లేదు. స్వాతంత్ర్యం ఉందను కుంటే అది భ్రమ. ప్రతీవ్యక్తీ, ప్రతీగ్రామం తమ స్వీయశక్తిని గుర్తించ నంతవరకూ స్వాతంత్ర్యము రాదు. ఏ గ్రామాని కా గ్రామం తమ తమ విద్యావిధానాన్ని, వర్తక వ్యాపారాన్ని, రక్షణను, న్యాయాన్ని స్వయంగా నెరవేర్చుకోవాలి. అప్పుడు ఏ గ్రామాని కాగ్రామం తనను తాను పాలించుకుంటుంది.

25 సంవత్సరాలక్రిందట బీహారులో భూకంపం వస్తే ప్రజానాయకులు ముందు అక్కడికి వెళ్ళి సేవాకార్యం ప్రారంభించారు. తరువాత ప్రభుత్వం వెళ్ళింది. కాని స్వరాజ్యం వచ్చిన తర్వాత ? 4 సంవత్సరాలక్రిందట బీహారులో నేను పర్యటిస్తున్నప్పుడు పెద్ద వరదలు వచ్చాయి. సీతామఢీలో అప్పుడు నేనున్నాను. అక్కడికి 4 మైళ్ళ దూరంలో సుమారు 150-200 మైళ్ళమేర జలమయం అయింది. అయినా సీతామఢీ ప్రజలు ప్రభుత్వం చేస్తుందిలే అని సినీమాలు చూస్తూ కూర్చున్నారు. స్వతంత్రం వచ్చిందంటే అన్ని పనులూ ప్రభుత్వమే చెయ్యాలను భావం ప్రబలింది. చివరకి ప్రభుత్వ సహాయము వచ్చింది. కాని జరిగిందేమిటి ? ఆ సహాయం పేదలకు అందనేలేదు. మధ్యలో పెద్దపెద్దవాళ్లే దానినుండి లాభం పొందారు. ఇంతకంటే విచిత్రమైన విషయం మరొకటుంది. ప్రభుత్వం అందరకీ సహాయం అందించాలంటే ఉద్యోగస్తులు చాలరు. కనుక ప్రజలను సహాయానికి రమ్మన్నారు. కాని అక్కడ పి. యస్. పి బలంగా

ఉంది. కనుక వారి ద్వారా ప్రజలకు సహాయం జరిగితే ఆ పార్టీ బలపడుతుందేమోనని, అలాకాక తమ పార్టీద్వారానే సహాయం చేయాలనుకున్నారు! ఇదీ ప్రజా స్వామ్యం! ధిక్కారము-ఇట్టి ప్రజాస్వామ్యానికి. అందుచేతనే స్వరాజ్యాన్ని మనం ఇంకా తేవలసియుంది. మన దేశంలోనే కాదు, ప్రపంచంలోనే నేడు స్వరాజ్యం లేదు.

ఇట్టి స్వరాజ్యం నమూనా కేరళలో స్థాపించి చూపాలి. ఇందు అందరూ సహకరించండి. పార్టీ భావాలను విడిచి పెట్టండి. ఎందుకంటే పార్టీలు చీలికలు తెస్తాయి. దానివల్ల శక్తి భిన్నా భిన్నం అవుతుంది. కులతత్వం నుండి విముక్తి పొందుట ఎంత అవసరమో, పార్టీ తత్వం నుండి విముక్తి పొందుటకూడ అంత అవసరం. పార్టీ తత్వం వీడి సర్వోదయ మండలిని గ్రామ గ్రామానా నిర్మించండి. సంపత్తి దానం, శ్రమదానం, గ్రామదానం ద్వారా గ్రామగ్రామాన గ్రామ రాజ్యం స్థాపించాలి. శాంతిసైన్యం నెలకొల్పాలి. అయితే ఈ పని ప్రతినిధుల వల్లకాదు ప్రజలు స్వయంగా చెయ్యాలి - మీకు సహాయానికిగాను 5,000 ప్రజలకు ఒక సేవకుడు ఉంటాడు. అతని పోషణ భారం ఈ 5 వేల ప్రజలూ వహిస్తారు. అప్పుడు గ్రామాల్లో అశాంతి ఉండదు. అయినా ఏ ఒక రిద్ధరైనా అశాంతి లేవదీయబోతే మన సైన్యమే శాంతి సైన్యం అవుతుంది.